బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...

## దయగల హృదయమే భగవన్నిలయం

# భూతదయే దైవత్వం

తటవర్తి వీరరాఘవరావు











# భూతదయే దైవత్వం



రచన & ప్రచురణ : **తటవర్తి వీరరాఘవరావు**


2011 సం॥రం : ఒక ముద్రణ
ప్రతులు : 6,000

2012 సం॥రం : మూడు ముద్రణలు
ప్రతులు : 9,000

2021 సం॥రం : ఒక ముద్రణ
ప్రతులు : 1,000

వెల : **రూ. 60/-లు**



**రచన: తటవర్తి వీర రాఘవరావు**

**తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.**

**సెల్ : 9440309812, 9490171853**

email : balajipyramid.bvrm@gmail.com

# విషయ సూచిక

# ముందు మాట

**దైవస్వరూపులైన ఓ మానవులారా!**

ఆ దీన జీవుల ప్రార్థన ఆలకించరా! అమాయకపు, మూగ ప్రాణుల రోదనలు వినిపించడం లేదా! ఇంకా మీకు వాటిపై దయ కలగటం లేదా? అవి అన్నీ కూడా మనలాగే దేవుని బిడ్డలే కదా! సృష్టిలో ఆయనకు అన్నీ సమానమే కదా! "పై వాడి దయ కోరే మనం మన క్రింది జీవులపై దయ చూపించలేమా!"

అవి నోరు తెరిచి అడగటానికి మాటలు కూడా రానివి. తమ బాధలను వెల్లడించలేని మూగజీవాలవి. ఎన్నో దెబ్బలను సహిస్తున్నాయి కాని నోటితో ఏమీ చెప్పలేవు. అవి దయాభిక్షను అర్థించలేవు. మమ్మల్ని దయతలచి వదిలేయి అనలేవు. అలాంటి అమాయకపు మూగ జీవులపై దయ చూపించలేమా?

మానవ జన్మ ఎత్తి రాక్షస కృత్యమైన జీవహింస చేసి మాంసం భక్షించటం తగునా? వాటిని ప్రేమించలేమా? అయ్యో వద్దు! వద్దు! ఈ రాక్షస కృత్యం మానండి! ఈ దురాచారం మానండి! మనం మానవులం! ప్రేమే మన మతం. అందరినీ, అన్నింటినీ ప్రేమిద్దాం. భగవంతుని సృష్టిలోని అన్ని జీవులను హాయిగా, ఆనందంగా జీవించనిద్దాం. నాలుక రుచి కోసం వాటిని చంపి, తిని పాపం చెయ్యాలా? ఆలోచించండి మాంసం రుచా? శుచా? పేరులోనే వుంది నీచు అని, అంటే నీచమైనదనేగా?

చూడండి ఒక చిన్న పావురాన్ని రక్షించటానికి తన దేహాన్ని కోసి ఇచ్చిన శిబి చక్రవర్తి దయ, ప్రేమ అప్పుడే మర్చిపోయామా? శ్రీరాముడు, బుద్ధుడు, ధర్మజుడు, గాంధీ లాంటి మహానుభావులు జన్మించిన దేశంలో పుట్టి రాక్షసంగా ప్రవర్తించగలమా?

ప్రేమ స్వరూపులారా! శాశ్వతం కాని ఈ దేహాన్ని నమ్మి, తుచ్ఛమైన జిహ్వా రుచి కోసం జీవులను చంపి వాటి మాంసంతో పొట్ట నింపుకుని, చివరకు భగవంతుని ఎదుట ఎలా నిలువగలం? ఈ రక్తపు కూడు ఎలా తినగలుగుతున్నామో ఆలోచించండి. భగవంతుడు తినటానికి ఎన్నో ఫలాలు, కాయగూరలు ఇస్తే మాంసాన్నే భక్షించాలా? శవాలనే తినాలా?

ఆలోచించండి ఆ నిర్దోషులైన మూగ జీవులపై 'దయ' చూపిద్దాం. వాటిని ఆనందంగా జీవించనిద్దాం. శాకాహారులవుదాం, ధ్యానం చేసి బ్రహ్మర్షి పత్రీజీ మార్గంలో పయనిద్దాం.

# భూతదయ

భూతములు అంటే జీవులు అంటే ప్రాణమున్న ప్రతీది అంటే సమస్త మానవులు, జంతువులు, పక్షులు, క్రిమి కీటకాలు, జలచరాలు అని అర్థం చేసుకోవాలి. వాటిపై దయ చూపించడమే భూతదయ అంటారు.

## దయ

తనకంటే క్రింది వారు ఎవరైనా సరే అంటే పనివారు, స్త్రీలు, బలహీనులు, అల్పులు, నిస్సహాయులు ఆఖరుకు జంతువులు ఎవరైనా సరే కాపాడమని, రక్షించమని అర్థించినపుడు, వారి అభ్యర్థనను మన్నించడమే 'దయ' చూపించడమంటే.

ఆఖరికి నిన్ను చంపడానికి ప్రయత్నించే శత్రువుపై నీది పై చెయ్యి అవుతుంది. శత్రువును చంపే అవకాశం వస్తుంది. శత్రువు చంపవద్దని, వదిలిపెట్టమని అర్థిస్తాడు. అలాంటి వాడి అభ్యర్థనను మన్నించడమే 'దయ' చూపించడమంటే.

ముష్టివాడు ధనం కాని ఇంకా ఏదైనా అర్థిస్తాడు. వాడి అభ్యర్థనను మన్నించడమే దయ చూపించడమంటే.

అలా దయ చూపించగలిగిన వాడు దైవంతో సమానం.

అందుకే **"దయ గల హృదయమే భగవన్నిలయం"** అంటారు.

అంటే దయ చూపించడమే దైవత్వం.

అలాగే మన క్రింది జీవులైన, అమాయకపు, (ఏమీ తెలియని) మూగ (బాధ చెప్పుకోలేని), నిస్సహాయ (రక్షించుకోలేని), నిర్దోషులైన (ఎవరికీ అపకారం చేయని) సాధు జీవులను హింసించడం, హింసిస్తూ చంపడం 'దయ' అనరు, క్రూరత్వం అంటారు. దైవత్వం అనరు, రాక్షసత్వం అంటారు.

ఆ సాధు జంతువులను ఎవరైనా హింసిస్తూ వుంటే, చంపే ప్రయత్నం చేస్తే అవి పారిపోవడానికి ప్రయత్నిస్తాయి, అరుస్తాయి, రోదిస్తాయి, వదిలిపెట్టమని ప్రార్థిస్తాయి. (కానీ వాటి భాష మానవులకు అర్థం కాదు) అలాంటి వాటి అభ్యర్థనను మన్నించడమే "దయ" చూపించడమంటే! దయ కలవారు జంతువులను ప్రేమతో చూస్తారు, వాటితో స్నేహం చేస్తారు.

జంతువులను ప్రేమించి, వాటితో స్నేహం చెయ్యండి. అవి మీకు ఎంతో ఉపయోగపడతాయి. ఆఖరుకు మీ కోసం వాటి ప్రాణం ఇవ్వడానికి కూడా వెనుకాడవు. అలా ఒక కుక్కను తీసుకోండి. అది యజమాని పట్ల ఎంత విశ్వాసం చూపిస్తుందో, అలాగే ఎద్దు, ఆవు, గొర్రె, మేక, కోడి, చేప అన్నీ మానవ జాతికి ఎంత మేలు చేస్తున్నాయో ఆలోచించండి. వాటి వల్ల మానవులకు ఎంత ఉపకారం జరుగుతుందో తెలుసుకుంటే వాటిని నిర్దాక్షిణ్యంగా, చంపి భక్షించం. వాటిని

రక్షిస్తాం. రక్షించడమే 'దయ'. భగవంతుని సృష్టిలో **"రక్షించే వాడు ఎప్పుడూ రక్షింపబడతాడు. హింసించే వాడు హింసింపబడతాడు".**

అలాగే జీవులు బాధ పడుతుంటే వాటి బాధా నివారణకు ప్రయత్నించడం. 'దయ' చూపించడమంటారు. అంటే జీవహింసను ఆపే ప్రయత్నం చెయ్యడం, మాంస భక్షణం మాన్పించడండం ఇవన్నీ 'దయ' కలిగిన వారే చెయ్యగలరు, చేస్తారు. అంటే దైవత్వం వున్న వారికే 'దయ' వుంటుంది. అంటే 'దయ' వున్న వాడే దేవుడు'. అందుచేత 'భూత దయే దైవత్వం'.

# జాలి

దయ లేకుండా ప్రవర్తించే వాడు అంటే జంతువులు మొర ఆలకించకుండా వాటి బాధను అర్థం చేసుకోకుండా తన వినోదం కోసం, తన ఆనందం కోసం చంపినా! వాటి మాంసం భక్షించినా! దాని ఫలితంగా భవిష్యత్తులో ప్రకృతి ధర్మం ప్రకారం అంటే భగవంతుని ధర్మం ప్రకారం శిక్షింపబడతాడు. అలాంటి శిక్షలు పొందిన వారిలో కొంతమందికి ఏక్సిడెంటులో కాలు పోవచ్చు, చేతులు పోవచ్చు, వళ్ళు కాలవచ్చు, ఏ శరీర భాగమైనా అనుకోకుండా కాలవచ్చు. చెప్పలేని రోగాలకు గురి కావచ్చు. అలాంటి వారు ఆదుకొమ్మని అర్థించినపుడు మనం వారిని చూసి జాలిపడగలం కానీ, అంతకన్నా ఏమీ చెయ్యలేం. వారి కాలు కానీ, చెయ్యి కానీ తిరిగి ఇవ్వలేము. వారి కాలిపోయిన భాగాలు మామూలుగా సరిచెయ్యలేం. జబ్బు ద్వారా పాడైపోయిన శరీర భాగాలను, కిడ్నీలు కానీ, లివర్ కానీ, గుండె కానీ, ఏదైనా సరే యధా ప్రకారం మనం తిరిగి ఇవ్వలేం. వారి మీద జాలి పడడం తప్ప.

అంటే భగవంతుని ధర్మ సూక్ష్మాలననుసరించి విధింపబడిన శిక్ష విషయంలో జాలి పడగలం కానీఇంకేమీ చెయ్యలేం. వారిని మామూలు స్థితికి తీసుకురాలేం.

అయ్యో పాపం! అలా అయ్యిందా! అని ఓదార్చుతాం. ఎందుకంటే అయ్యో! పాపం చేసి అలాంటి పరిస్థితి తెచ్చుకున్నావా? పాపం చెయ్యకుండా వుంటే ఆ పరిస్థితి వచ్చి వుండేది కాదు కదా? అని వారి మీద 'జాలి' పడతాం.

కానీ మనం శిక్షించేటపుడు మాత్రమే దయ కోరిన వారిపై 'దయ' చూపగలం; ఆ శిక్ష పడకుండా చెయ్యగలం, కష్టం కలగకుండా చెయ్యగలం. కానీ ప్రకృతి నియమాలననుసరించి శిక్షపడినపుడు మాత్రం ఏమీ చెయ్యలేం... జాలిపడటం తప్ప. అందుచేత మన చేతులలో వుంది కాబట్టి "దయ చూపించగలం". మన చేతులలో లేదు కాబట్టి "జాలి పడగలం".

గమనించినట్లయితే మనం ఆరాధించే దేవుళ్ళంతా జంతువులను ప్రేమించారు, వాటితో స్నేహంగా వుండేవారు. అలాగే ఆ జంతువులు కూడా

వారితో స్నేహంగా వుండేవి, వారికి ఎంతో దగ్గరగా సంచరించేవి, వారితో కలిసి మెలిసి వుండేవి, వారిలో ఒక భాగంగా జీవించేవి. అందుకే ఎంతో మంది దేవుళ్ళు, అంటే దైవత్వం పొందిన వారు జంతువులతో స్నేహం చెయ్యడం. వాటితో ప్రేమగా కలిసి వుండడం, మనం వారి ఫోటోల ద్వారా కూడా చూస్తున్నాం. అలా దేవుళ్ళందరూ తమ క్రింది జీవులు మీద దయ కలిగి వుండేవారని, వాటితో స్నేహం చేసే వారని మనం తెలుసుకోవచ్చు. గమనిస్తే ప్రస్తుతం బ్రహ్మర్షి పత్రీజీ కూడా ఆ మూగ జీవులను హింసించవద్దని, వాటిపై దయ చూపించమని ప్రపంచవ్యాప్తంగా అందరికీ బోధిస్తున్నారు. దానికి కారణమైన మాంస భక్షణ మాన్పిస్తున్నారు.

అలా ఎవరు దయతో ప్రవర్తించినా, వారిలో దైవత్వం వున్నట్టే! వారు దైవమే! అందుచేత "భూతదయే దైవత్వం" అని తెలుసుకోవాలి.

# కరుణ

కాఠిన్యం ప్రదర్శించకపోవడమే 'కరుణ'. కక్ష గట్టకపోవడమే 'కరుణ'. కఠినంగా వ్యవహరించకపోవడమే 'కరుణ'. పగబట్టకపోవడమే 'కరుణ'.

కొన్ని సందర్భాలలో తాను చెప్పింది వినలేదని తాను చెప్పినట్టు చెయ్యలేదని తన మాట కాదన్నాడని వారిని కఠినంగా దండిస్తారు. వారి పట్ల నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తారు. కానీ అలాంటి వారిని వదిలి వెయ్యడమే 'కరుణ'. పట్టించుకోక పోవడమే 'కరుణ'. ఏ చర్య తీసుకోకపోవడమే 'కరుణ'. శిక్షించకపోవడమే 'కరుణ'.

కరుణ ఉన్నవారు తన పట్ల ఎలా వ్యవహరించినా, తనకు అన్యాయం చేసినా, నష్టం, కష్టం కలిగించినా వారిని పట్టించుకోడు. వదిలివేయడమే 'కరుణ'. వాడి పాపానికి వాడిని వదిలి వేయడమే 'కరుణ'. వాడిని ఏమీ అనకపోవడమే 'కరుణ' ఎవరి దగ్గరా వాడిని విమర్శించక పోవడమే 'కరుణ'. వాడిని ఏమీ చేయకపోవడమే 'కరుణ'?

'కరుణ' కలిగిన వారు నిర్ణయం ప్రకృతికి అంటే భగవంతునికి వదిలి వేస్తారు. అంతే కానీ ప్రతిగా ఏదో చేసి తాను మరొక తప్పు చేయడు. తాను మరల శిక్షకు పాత్రుడు కాడు.

గౌతమబుద్ధుని శత్రువుగా భావించే దేవదత్తుడు బుద్ధుని ఎన్ని రకాలుగా బాధించాలని చూసినా! బుద్ధుడు ప్రతిగా ఏమీ చెయ్యలేదు. ఏమీ అనలేదు. దీనినే 'కరుణ' అంటారు. బుద్ధుడు కరుణామయుడు కాబట్టి. 'కరుణ' వుంది కాబట్టి, దేవదత్తుడు ఏమి చేసినా పట్టించుకోలేదు. 'కరుణ' కూడా దైవత్వంలో మరొక లక్షణం. అందుచేత మీరు కూడా కరుణ కలిగి వుండండి. దైవత్వాన్ని పొందండి.

# భూత దయ ఎవరికి వున్నట్టు?

భూతదయ కలవాడు మాంసాన్ని తినడు. మాంసం తినే వారిలో భూతదయ లేదని కాదు. వారిలో చాలా మంది తినే ఆహారాన్నే చూస్తున్నారు. వారు ఎంతసేపూ ఆహారం తింటున్నారనుకుంటున్నారు కానీ మాంసాహారం తయారు కావడానికి వెనకాల ఎంత హింస జరుగుతుందో! ఆ జంతువులు ఎంత క్రూరంగా హింసింప బడుతున్నాయో! చాలా మందికి తెలియదు. చూస్తే మాంసం తినలేరు కూడా! చాలా మందికి రక్తాన్ని చూస్తేనే కళ్ళు తిరుగుతాయి. చూడలేరు కూడా. ఆలోచించండి, రక్తాన్ని చూడలేని వాళ్ళు రక్తంతో కూడుకున్న మాంసాన్ని ఎలా తినగలరు?

ఒకరకంగా చెప్పాలంటే ఆ జంతువులు ఎలా చంపబడతాయో! ఎలాంటి క్రూరమైన పద్ధతులు చంపడానికి అనుసరిస్తారో! అన్నది తమ కళ్ళతో ప్రత్యక్షంగా చూస్తే మాంసం, చేపలు తినేవారిలో నూటికి 60-70 మంది వెంటనే మాంసం తినడం మానేస్తారు. అలా చూసినా తినగలుగుతున్నారంటే వారంతా రాక్షస సమానులే. అందుచేత జంతువులను చంపే విధానాలు కొన్ని చూద్దాం.

చేపలను పట్టుకోవడానికి వానపామును తుంచి గాలానికి గుచ్చుతారు. వానపాము గిలగిలలాడుతుంది. దాని వల్ల చేప దృష్టి దాని మీద పడి ఆకర్షితమవుతుంది. చేప వానపామును తినడానికి ప్రయత్నించి గాలానికి చిక్కుకుంటుంది. అలా గాలానికి గుచ్చుకున్న చేపను తీసి వేరే తాడుకు గుచ్చుతారు. అది చావకుండా నీటిలో వుంచుతారు. అలా చేయడం వల్ల ఆ చేప పారిపోనూ లేదు, చావలేదు కూడా. అది నీటిలో అలా కొట్టుకుంటూ చాలా రోజులు వుంటుంది.

ఉత్తరప్రదేశ్‌లో చేపలు పట్టే వాళ్ళు చాలా మంది మొసలి మాంసం కూడా తింటారు. వారు మొసలిని పట్టుకుని, తాళ్ళతో బంధించి అవసరాన్ని బట్టి దాని కాళ్ళు, తోక నరుకుతారు. అలా ఎన్నో రోజులు దాని మాంసం వాడుకుంటారు. అన్ని రోజులూ ఆ మొసలి గిలగిలా కొట్టుకుంటూనే వుంటుంది.

పందులను చంపేటపుడు కొందరు దుడ్డు కర్రలతో కొట్టి చంపుతారు. అలా చంపితే మాంసం రుచిగా వుంటుందని వారి ఉద్దేశం. ఇంకా కొంతమంది పందిని తాళ్ళతో బంధించి పొడవైన గునపాన్ని దాని గుండెల్లో దించుతారు. అది బాధతో భయంకరంగా అరిచే అరుపులు కిలోమీటర్ల లెక్క వినిపిస్తాయి. ఒకవేళ గునపం గుండెల్లో సరిగ్గా దిగకపోతే తీసి మరల గుచ్చుతారు. అలా పంది చావడానికి చాలా సమయం పడుతుంది. దాని రోదనలు హృదయవిదారకంగా వుంటాయి. ఇంకా కొన్ని చోట్ల కాలుతున్న ఇనుప చువ్వలు పంది గుండెలో గుచ్చుతారు.

ఇంకా కొంతమంది పంది కాళ్ళు, నోరు తాళ్ళతో బంధించి మంటలలో

వేస్తారు. అలా కాలుతున్న పందికి అరవటానికి కూడా అవకాశం ఇవ్వరు. అలా పందుల్ని చంపటానికి క్రూరమైన పద్ధతులు అవలంభిస్తారు. ఇలాంటి వారికి భగవంతుడు ఎలాంటి శిక్ష వేస్తాడో?

ఇక కోళ్ళ విషయానికి వస్తే సరే సరి. ఆ కోళ్ళను ఫారాలలో నుంచి మార్కెట్టుకు ఎంతో నిర్దయతో రవాణా చేస్తారు. సైకిళ్ళ మీద, బైకుల మీద తలక్రిందులుగా వ్రేలాడతీస్తారు. వాటి తలలు చక్రాలకు కూడా తగులుతూ వుంటాయి. ఏమి చేయగలవు మూగగా రోదించడం తప్ప. నిస్సహాయమైన జీవులు కదా? కొంతమంది సంతలో ఒక చేత్తో కూరల సంచి, మరొక చేత్తో కోడి రెక్కలు విరిచి పట్టుకుంటారు. అవి కూడా ప్రాణమున్న జీవులన్న ఆలోచనే వుండదు. వాటిని కూడా కూరగాయలుగా భావిస్తారు. ఇవి అత్యంత దయనీయమైన దృశ్యాలు.




కోళ్ల దుకాణంలో ఇనుప జాలీల్లోనూ, గంపలలోనూ కోళ్ళను బంధిస్తారు. అలా ఆకలి దప్పులతో అలమటించే కోళ్ళ ఎదుటే, ఇతర కోళ్ళను ఒక్కొక్కటిగా కోస్తారు. అలా తమ సహచరుల దుర్దశ చూస్తూ తమ వంతు కోసం మిగిలినవి దీనంగా ఎదురు చూస్తూ వుంటాయి. అంతకన్నా ఏమి చేయగలవు? ఇలాంటి వారందరికీ పరమేశ్వరుడే 'దయ' పుట్టించాలి.

కసాయి దొడ్లలోనికి జంతువులను తీసుకువెళ్ళేటపుడు వాటికి ఏమి జరుగబోతుందో వాటికి తెలుస్తుంది. మేకలను వెనుక కాళ్ళతో లాగి విసురుతారు. కర్రలతో కొట్టి నెడతారు. అలాగే ఆవులను, గేదెలను కర్రలతో బాది, బాది తోకలను మెలి తిప్పి, ముల్లు కర్రతో పొడిచి మరీ లోపలకు లాక్కెళతారు. ఇక లోపల బ్రతికి వుండగానే వాటి మాంసం కోసే విధానం అత్యంత దయనీయం, హృదయ విదారకం. అలా వాటిని తలక్రిందులుగా వ్రేలాడదీస్తారు. కావలసిన చోట కోసి వాటి రక్తాన్ని బకెట్లలో పడతారు. బ్రతికుండగానే వాటి చర్మాన్ని వలుస్తారు. వాటి మాంసాన్ని ముక్కలుగా కోస్తారు. అది ఎప్పుడు చనిపోతుందో దానికే తెలియదు. బ్రతికి వుండగానే ఈ పనులు చేస్తే మాంసం రుచిగా వుంటుందని వారి ఉద్దేశ్యం. గమనిస్తే వాటి బాధ వర్ణనాతీతం. అవి చెప్పుకోలేవు, ఏమీ చేయలేవు, మూగగా రోదించడం తప్ప.

కానీ ఈ రోజు వాటి పరిస్థితి ఎలా వుందో రేపు వాటిని చంపే హంతకుల పరిస్థితి కూడా అలాగే వుంటుంది. వాటిని అలా చంపటానికి కారకులైన వారు కూడా తరువాత అలాంటి నరకం అనుభవించవలసిందే!

ఆలోచించండి ఇవన్నీ కళ్ళతో చూసినవారు ఎంతమంది మాంసం తినగలరు? అసలు చాలా మంది స్వయంగా ఏ పక్షిని, జంతువును చంపలేరు,

చంపబడుతున్నపుడు చూసి తట్టుకోలేరు. అలాంటి వారు మాంసం మాత్రం ఎలా తినగలరు? పిల్లా పాపలు గల మహిళలు కసాయి దొడ్డిలో జంతువులు, పందులు చంపబడటాన్ని చూడాలి. ఎందుచేతనంటే ఇతర జీవుల పిల్లలపై మానవులు ఎంత అత్యాచారం చేస్తున్నారో వారికి తెలుస్తుంది. 'దయ' గలవారు ఇలాంటి పనులు చెయ్యగలరా? అలాంటి పనులు ప్రోత్సహించగలరా? హింసకు కారకులు కాగలరా?

ఒక్కసారి కసాయి దొడ్లకు వెళ్ళి ఆ జంతువుల కళ్ళలో కళ్ళు కలిపి వాటి భావాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి. వాటి దీనత్వం మీకు అర్థమవుతుంది. అవి మిమ్మల్ని రక్షించమని వేడుకుంటాయి. కాపాడవా? అని అర్థిస్తుంటాయి. నా పరిస్థితి ఇలా అయిపోయిందని బాధను వ్యక్తం చేస్తాయి. అలాంటి పరిస్థితులలో స్వయంగా మనమే కనుక వుంటే మనం మన భావాలు ఎలా వ్యక్తం చేస్తూ వుంటామో! అవి కూడా అలానే అర్థిస్తాయి.

ఒకరకంగా చెప్పాలంటే అవి నిర్దోషులు. అవి వాటి జీవితంలో ఎవరికీ అపకారం చెయ్యలేదు. ఏమైనా చేస్తే ఉపకారమే చేసాయి తప్ప. అపకారం చేసి దోషులైన వారికి శిక్షలు వేయడంలో అర్థం వుంది కానీ ఏమీ అపకారం చేయని నిర్దోషులైన ఆ మూగ జీవాలపై అంత అత్యాచారమా? అంత క్రూరమైన శిక్షా? నిజంగా అలాంటి వాటిపై జరిగే అత్యాచారాన్ని చూసి 'దయ' కలగని, 'కరగని' గుండె నిజంగా రాతి గుండే!

ఆలోచించండి జాలి గుండె, సానుభూతి లేని వారు ఇతరుల బాధను ఎలా అర్థం చేసుకోగలరు? తమ భార్య కానీ, భర్త కానీ, తల్లి కానీ, తండ్రి కానీ... ఎవరైనా సరే వారి కుటుంబ సభ్యుల బాధను ఎలా అర్థం చేసుకుంటారు? చేసుకోలేరు కదా? అలాంటి వారు కుటుంబంలో వుంటే ఆ కుటుంబంలో సుఖశాంతులు ఎలా వుంటాయి?

భారతదేశంలో అన్ని దేశాల కంటే ఎక్కువగా గురువులు, అవతార పురుషులు, ఋషులు, మునులు జన్మించారు. అంతేకాదు ఇక్కడ వున్నన్ని మతగ్రంథాలు, వేదశాస్త్రాలు, పురాణ గ్రంథాలు లాంటివి మరే ఇతర దేశాలలో కూడా వుండకపోవచ్చు. కానీ ఇటువంటి భూమి మీద ఇలాంటి అత్యాచారాలు జరుగుతున్నాయంటే ఆశ్చర్యం కలుగకమానదు.

మానవులారా! ఆలోచించండి. పాపాన్ని సంపాదిస్తున్నారు. కానీ లెక్క చెల్లించవలసి వచ్చినపుడు మిమ్మల్ని రక్షించే వారెవరూ ఉండరు. అందుచేత జీవుల హింసకు కారణమయ్యే మాంసాన్ని తినకండి. కారణం **"తినే వాడు వుంటేనే చంపేవాడు చంపుతాడు. తినేవాడే లేకపోతే చంపేవాడు చంపనే చంపడు".** అందుచేత తినేవాడే ఒకరకంగా హింసకు కారకుడు. అందుచేత మాంసం మానండి. శాకాహారులు కండి. జంతువులపై 'దయ' చూపండి. తెలుసుకోండి హింస చేయని వారికి, హింసకు కారకులు కాని వారికే భూతదయ వున్నట్టు.

# శత్రుత్వం వదలండి- మిత్రత్వం పెంచుకోండి

ఒకరకంగా వైరాన్ని వదలడమే 'కరుణ'. వైర భావంతో వున్నవాడు హింస చేస్తాడు. హింసిస్తాడు.

ఎవరైనా జీవులను, ప్రాణులను హింసిస్తున్నారంటే దానికి కారణం వాటి పట్ల తమకున్న వైర భావమే, శత్రుత్వమే. ఉదాహరణకు దోమలనే తీసుకుందాం. అవి తమకు హాని కలిగిస్తాయని మానవుల అభిప్రాయం. వాటి వల్ల తమకు వ్యాధులు వస్తాయన్న భావం వుండడం వల్ల మానవులు వాటిని తమ శత్రువులుగా భావించి వాటిని చంపటానికి, వాటిని సమూలంగా నాశనం చెయ్యటానికి, నిర్మూలించటానికి రకరకాలుగా ప్రయత్నిస్తూంటారు. అలా వాటితో ఎప్పుడూ వైరభావం ప్రదర్శిస్తూనే వుంటారు. అందుచేత అక్కడ హింస కనబడుతుంది.

అలా దోమజాతిని మానవులు శత్రువుగా భావించినపుడు ఆ జాతి కూడా! అంటే దోమ జాతి కూడా మానవుల పట్ల శత్రుత్వం ప్రదర్శిస్తూనే వుంటుంది. అవి మానవుల్ని బాధించటానికి ప్రయత్నిస్తూనే వుంటాయి.

మానవుల మధ్య హింస జరగడానికి కారణం కూడా వైరమే. అంటే శత్రుత్వం వల్లే. అలాగే హింసకు ప్రతి హింసే పరిష్కారమన్నట్టుగా మానవులు భావిస్తున్నారు. ఫ్యాక్షనిజానికి కారణం ఇదే. కానీ వైరం వల్ల హింస కొనసాగుతూనే వుంటుంది. హింసకు అంతం ఉండదు.

తెలుసుకోండి **"హింస వైరాన్ని పెంచుతుంది. అహింస మిత్రత్వాన్ని పెంచుతుంది". "హింస, వైరం శత్రువులను తయారుచేస్తుంది. కరుణ, దయ, అహింస మిత్రులను తయారు చేస్తుంది".** ఎప్పుడైనా ఎవరికైనా శత్రువుల వల్లే ప్రమాదం కాని మిత్రుల వల్ల కాదు. శత్రువు పట్ల అప్రమత్తంగా వుండాలి. కానీ మిత్రుల పట్ల కాదు. చుట్టూ శత్రువులు వుంటే భయంతో జీవించాలి. కాని చుట్టూ మిత్రులు వుంటే నిర్భయంగా జీవించవచ్చు. అందుచేత **"శత్రువులను పెంచే 'హింస' వదలాలి. మిత్రులను పెంచే 'అహింస'ను చేపట్టాలి".** మానవుల విషయంలోనైనా, జంతువుల విషయంలోనైనా సరే. ఏ జాతితో మానవుడు వైరాన్ని పెంచుకోకూడదు. మిత్రత్వాన్ని పెంచుకోవాలి. 'హింస'ను ఆశ్రయించకూడదు. 'అహింస'ను ఆశ్రయించాలి. ప్రకృతి అంటే ఏమిటో తెలుసుకోవాలి. తాను కూడా అన్ని జీవులలాగే ప్రకృతిలో భాగమని తెలుసుకోవాలి.

చాలామంది పంటపొలాలలో పురుగుమందులు, విషరసాయనాలు వాడుతుంటారు. తమ పొలంలో ఏమీ లేకపోయినా ముందు జాగ్రత్త చర్యగా అవి చల్లుతూంటారు. అక్కడ వున్న కొద్దిపాటి క్రిమి కీటకాలను, పురుగులను

చంపుతారు. అలా చేయగానే ఆ జాతి ఆగ్రహానికి వారు గురవుతున్నారు. వెంటనే ఆ జాతి ఏకమై వారి పంటను నష్టపరచటానికి ప్రయత్నిస్తాయి. వారి పంటపై యుద్ధాన్ని ప్రకటిస్తాయి. వారు ఇంకా, ఇంకా విషాలు చల్లి వాటిని చంపుతారు. చివరకు వారి ఆహారం కూడా విషతుల్యమవుతుంది. అది తింటే వారికి రోగాలు వస్తాయి, బాధలు పడతారు. ఆ పంట ద్వారా సంపాదించిన ధనమంతా రోగాలు నయం చేసుకోవడానికి ఖర్చవుతుంది. చివరకు ఎంత పంట పండినా, ధనం వచ్చినా నష్టపోతారు, కష్టాల పాలవుతారు. ఇదంతా హింసవల్లే. ఆ జీవి పట్ల వైర స్వభావం వల్లే. కరుణ స్వభావం లేకపోబట్టే!

గమనించండి ఎవరైనా సరే ధైర్యంగా ఆ జీవుల పట్ల మిత్ర భావంతో వాటిపై దయ చూపించి వాటిని హింసించకుండా, చంపకుండా వుండి వాటి పట్ల మిత్రభావం ప్రదర్శిస్తే, అవి కూడా అతనికి మిత్రులై అతనికి నష్టాన్ని కలుగచెయ్యవు. ప్రకృతిలో భాగమైన వాటిని హింసించకపోవడం వల్ల ప్రకృతి కూడా సహకరిస్తుంది. వాతావరణం అనుకూలిస్తుంది, పుష్కలమైన పంటలు పండుతాయి. మిత్రుడు ఎప్పుడూ హాని చెయ్యడు అన్నది ప్రత్యక్షంగా చూపిస్తాయి. తక్కువ ఖర్చుతో ఎక్కువ ఫలసాయం పొందవచ్చు. విషం లేని ఆహారం తిని ఆరోగ్యంగా జీవించవచ్చు. మందులకు, రోగాలకు ఖర్చులు వుండవు, ఆనందంగా వుండవచ్చు. అందుచేత అన్ని జీవులపట్ల వైరాన్ని వదలండి. హింసను మానండి. మిత్రత్వాన్ని పెంపొందించుకోండి. అన్ని జంతువులతో స్నేహంగా మెలగండి, దయ చూపించండి.

"హిమాలయ గురువులతో సహజీవనం" అన్న పుస్తకం స్వామి రామా వ్రాశారు. అన్ని జీవులను మనం ప్రేమించినపుడు, వాటితో మిత్రత్వం చేసినపుడు అవి వారికి ఎంతటి ఉపకారం చేస్తాయో! వారితో ఎంత స్నేహంగా వుంటాయో స్వామి రామా తెలియచేశారు".

ఇదే విషయం "రామ తీర్థ వేదాంత భాష్యం" అన్న పుస్తకంలో స్వామి రామతీర్థ కూడా తెలియచేయడం జరిగింది. అలా జంతువులతో స్నేహంగా వుండడం వల్ల క్రూర మృగాలు కూడా వారికి హాని చేయలేదు, వారితో స్నేహంగానే వుండేవి.

అలాగే దత్తాత్రేయ స్వామి చుట్టూ జంతువులు వుంటాయి. స్నేహంగా వుంటాయి. ఆయన ఫోటోలో మానవులు కనిపించరు. కానీ జంతువులే వుండటానికి కారణం అన్ని జాతులను ప్రేమించమనే. అన్నిటితో స్నేహంగా వుండమనే. మిత్రులుగా మెలగమనే. శివుని శరీరానికి పాములు చుట్టి వుండటం మనం చూస్తూనే వుంటాం కదా! జీసస్ క్రైస్ట్ చేతిలో గొర్రె పిల్ల మృదువుగా లాలించ బడుతుంటుంది. ఆయనను కాపరి అని చెబుతారు కారణం ఆయన అన్ని జీవులను, జంతువులను రక్షించేవాడని అర్థం.

అలా ఏ మహానుభావులను చూసినా, మహాత్ములను చూసినా అందరూ అన్ని జంతువులతో స్నేహంగా వున్నవారే. అన్నిటినీ ప్రేమించినవారే. అందుచేత మనం కూడా అందరితో, అన్నిటితో స్నేహం చేద్దాం. మిత్రత్వాన్ని పెంచుకుందాం. శత్రుత్వాన్ని వదిలేద్దాం. అప్పుడు చూద్దాం మిత్రత్వంలోని గొప్పతనాన్ని.

అలా జీవించాలంటే ఆత్మ జ్ఞానం తప్పనిసరి. ఆత్మ జ్ఞానం కలగాలంటే ధ్యానం చేయాలి. ధ్యానం చేసే వారు హింస చేయరు. వైరాన్ని వదులుతారు. మిత్రత్వాన్ని పెంపొందించుకుంటారు. 'దయ' కలిగి వుంటారు. అహింసామార్గాన్ని స్వీకరిస్తారు. ఆనందంగా జీవిస్తారు.

ఆఖరుగా తెలుసుకోండి. **"సృష్టిలో ఏ జాతికీ మానవుడు హాని చెయ్యకపోతే! సృష్టిలోని ఏ జాతి వల్ల మానవునకు హాని జరగదు".** పైగా ఉపకారం కూడా కలుగుతుంది. ఇదే సృష్టి ధర్మం. కారణం అంతా ఒక్కటే కనుక. "మమాత్మా సర్వభూతాత్మ" అని శాస్త్రాలలో వుంది కదా! అందుచేత శత్రుత్వాన్ని వదలి మిత్రత్వాన్ని పెంచుకోవాలి. జీవులపై 'దయ' కలిగి వుండాలి. ధ్యానం చేస్తే ఈ సత్యాలన్నీ తెలుస్తాయి.

**"దయకల పురుషుడు మాత్రమే ధర్మాత్ముడవగలడు"**




# ధ్యానం చేసే పద్ధతి - ఆనాపానసతి



**"శ్వాస మీద ధ్యాస"**

ఎవరికి తగిన సుఖాసనంలో... వారు... హాయిగా... కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని.... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను... ఏకధారగా.. గమనిస్తూ వుండాలి! ఏ దేవతా, గురు రూపాన్నీ ప్రత్యేకంగా ఊహించుకోరాదు! ఏ దైవ నామ స్మరణా వుండరాదు! మామూలుగా జరుగుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసలనే ఆహ్లాదంగా గమనిస్తూ వుండాలి.

**"ధ్యానం నిర్విషయం మనః"**

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే... క్రమక్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది... చిత్తవృత్తులు నిరోధింపబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది... ఇదే ధ్యాన స్థితి.

**"ఆత్మానుభవాలు"**

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీమండల, ఆత్మానుభవాలను విజ్ఞానోత్సాహంతో గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో శరీరం వెలుపల వున్న విశ్వమయ ప్రాణశక్తి.... అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీమండలాన్ని శుద్ధి చేస్తుంది.

**"ప్రతిరోజూ ధ్యానాభ్యాసం"**

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు.. తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా.... ధ్యానం చెయ్యాలి.

# అందరికీ ఒక్కటే న్యాయం

సృష్టిలో "న్యాయం" అన్నది అందరికీ సమానం. ఈ విషయం మానవులు గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు ఒక దోమ కుట్టినపుడు కలిగిన కొద్దిపాటి హింసకే మానవుడు ఆ దోమను నలిపి, చంపి కక్ష తీర్చుకుంటున్నాడే. మరి అలా చంపినందుకు దోమలకే కనుక మానవుణ్ణి నరికి చంపగలిగే సామర్థ్యం, శక్తి వుంటే అసలు భూమి మీద మానవ జాతి ఉంటుందా?




మానవునికి తెలివి వుంది కాబట్టి చట్టం తన చేతుల్లోకి తీసుకుంటున్నాడు. మరి అల్పులు, బలహీనులు పరిస్థితి ఏమిటి? వీరికి న్యాయం ఎవరు చేస్తారు?

సృష్టిలో ఎప్పుడూ అల్పులకు, బలహీనులకు భగవంతుడే న్యాయం చేస్తాడు.

మనం అప్పుడప్పుడు అనుకుంటూ వుంటాం. ఎవరి వల్ల అన్యాయం జరిగినా, వారిని ఏమీ చేయలేకపోయినా, భగవంతుడే శిక్షిస్తాడని, శిక్షించాలని అనుకుంటాం, కోరుకుంటాం కూడా. మరి మూగ జీవులు తమకు అన్యాయం జరిగినపుడు భగవంతుని కోరవా? భగవంతుడు వాటికి న్యాయం చెయ్యడా?

కచ్చితంగా చేస్తాడు. **"సృష్టిలో న్యాయం అన్నది అందరికీ సమానం".** భగవంతునికి రాగద్వేషాలు లేవు. ఆయనకు అందరూ సమానం. అన్ని జాతులు ఆయనకు ఒక్కటే. కారణం అన్నీ ఆయనచే సృష్టింపబడినవే. ఆయన ఏర్పరచిన ధర్మ సూక్ష్మాల ప్రకారమే సృష్టి నడుస్తుంది. భగవంతుని ధర్మ సూక్ష్మాలకు విరుద్ధంగా ఎవరు ప్రవర్తించినా శిక్షకు గురి కావలసిందే. కష్టాల పాలు కావలసిందే.

ఈ విషయం మానవులు గుర్తించాలి. తనకే కాదు. అందరికీ ఒకటే న్యాయం. భగవంతుని సృష్టిలో బలవంతులకు, బలహీనులకు, మేధావంతులకు, మేధస్సు లేని వారికి "అందరికీ ఒకటే న్యాయం!". అందుచేత ఈ విషయం గ్రహించాలి. హింస చేయకూడదు. అన్నిటినీ ప్రేమించాలి. తన బాధ ఎలాంటిదో అందరి బాధ అలాంటిదేనని తెలుసుకోవాలి. ఇదే విషయం గీతలో కూడా చెప్పబడింది.

**శరీరానికి ప్రాణం పోయగల శక్తి లేనివాడు**
**శరీరం నుంచి ప్రాణాలను తీయటానికి**
**పాల్పడటంలో న్యాయం ఎక్కడ వుంది – తిరుమూలర్**



శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యో ర్జున!
సుఖం వాయది వా దుఃఖం సయోగీ పరమో మతః (భ.గీ.6-32)

తా:- ఓ అర్జునా! ఎవడు సమస్త భూతముల యొక్క సుఖ దుఃఖాలు, తన సుఖ దుఃఖాలుగా చూస్తాడో, వాడే అందరిలో నాకు ఎక్కువ ప్రియుడు. ఇది నా నిశ్చితాభిప్రాయము అని శ్రీ కృష్ణ భగవానుడు సెలవు ఇచ్చారు.

అంటే తన శరీరానికి కలిగిన బాధ ఎంత కష్టంగా వుంటుందో, అలాగే సమస్త జీవుల యొక్క బాధ కూడా, వాటికి అంత కష్టంగా వుంటుందని తెలుసుకోవాలి. హింస చేయకూడదు. మాంసభక్షణ మానాలి. అన్నిటిని ప్రేమించాలి. అన్నిటితో స్నేహ పూర్వకంగా జీవించాలి. అన్నిటి పై 'దయ' చూపించాలి. కారణం అందరూ, అన్ని జీవులు ఒక్కటే కనుక. అన్నీ భగవంతుని రూపాలే కనుక. ఇది సత్యం. ఇదే 'సృష్టి రహస్యం'. అందుకే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నారు.

కొంతమంది అనవచ్చు. మేము వాటిని చంపకపోతే అవి కుట్టి మమ్మల్ని బాధించవా? కానీ గుర్తుంచుకోండి **"ఈ భగవంతుని సృష్టిలో మనం ఎవరికీ హాని చెయ్యకపోతే, ఎవరి వల్లా మనకు హాని జరగదు"** అంటే **"మనం వేటి జోలికీ వెళ్ళకపోతే ఏవీ మన జోలికి రావు".**

అందుకే ఋషులు, మహర్షులు అరణ్యాలలో, కొండలలో తపస్సు అంటే ధ్యాన సాధనలు చేసుకున్నా ఏ క్రూర జంతువు, క్రూరమృగం వారికి హాని చెయ్యలేదు. కారణం వారు వాటికి హాని తలపెట్టే వారు కాదు. పైగా వాటితో స్నేహం చేసేవారు.

అలాగే కొందరు ఋషులు గుహల్లో, చెట్టు తొర్రల్లో సాధనలు చేసేవారు. వారికి మనలా ఫ్యానులు, ఆల్‌అవుట్‌లు, మస్కిటో కాయిల్స్ లేవు. దోమలే కనుక వారికి హాని చేస్తే, కుడితే వారు బ్రతికేవారా? అలా సాధనలు చేసుకోగలిగేవారా?

విష జంతువైనా, ఆఖరుకు పామైనా సరే మీరేమీ హాని చెయ్యకపోతే అది మీ జోలికి రాదు. వచ్చినా ఏమీ చెయ్యదు. సహజంగా జంతువులకు మానవులు తారసపడగానే అవి మానవుల కళ్ళలోకి చూస్తాయి. కారణం మానవుల భావాన్ని తెలుసుకోగల శక్తి వాటికి వుంది. మానవుడు కనుక వాటికి హాని చేసే ఉద్దేశ్యంలో వున్నట్లయితే మానవుడు కంటే ముందే దాడి చేస్తాయి. సహజంగా పారిపోవటానికి ప్రయత్నిస్తాయి. దారి లేనపుడు దాడి చేస్తాయి.

సహజంగా మానవులు వేటిని చూసినా అది వీరికి హాని చేస్తాయేమో అనే భయంతో ఏదో ఒకటి చెయ్యాలని చూస్తారు. అలాంటి భావం మానవునిలో ఏర్పడిన వెంటనే ఆ జంతువులు దాడి చేస్తాయి.

అందుచేత హాని కలిగించే భావం మీ నుంచి తీసెయ్యండి. అన్నిటిని ప్రేమించండి. స్నేహభావం కలిగి వుండండి. మిత్రులుగా భావించండి. అవి కూడా మీకు మిత్రులవుతాయి. ఇదే విషయం స్వామి రామా కూడా చెప్పారు. మరి ఈ సత్యం తెలియాలంటే ధ్యానం చెయ్యవలసిందే!

# వినోదాలు - వేడుకలు ఎలా వుండాలి?

ఆలోచించండి ఎవరైనా ఏ వివాహమో, గృహ ప్రవేశమో లాంటి శుభకార్యమైనా, ఏ ఫంక్షన్, పార్టీ లాంటి వినోద కార్యక్రమమైనా లేక ఏ పుట్టినరోజు, మ్యారేజ్ డే లాంటి వేడుకలైనా చేసుకునేటపుడు ఏ రకమైన అశుభం జరిగినా అంటే ఎవరైనా చనిపోయినా, లేదా ఎవరికైనా యాక్సిడెంట్ అయినా లేదా అనుకోకుండా గుండెపోటు లాంటి తీవ్ర అస్వస్థత కలిగినా వెంటనే ఆ కార్యక్రమం ఆపేస్తారు. ఆ వేడుక మానేస్తారు. అందరూ విషాదంలో, విచారంలో మునిగిపోతారు.

అలాంటి సందర్భంలో ఎవరైనా జోక్సు వేసినా, గంతులు వేసినా వెంటనే మిగతా వారు, పెద్దలు తిడతారు. బుద్ధి లేదా అంటారు. అలా ఒక్కసారిగా వాతావరణం మారిపోతుంది. అందరూ విషాదంలో మునిగిపోతారు.

దీనికి ముఖ్య కారణం అలా అంతా విషాదంలో వున్నపుడు, రోదిస్తున్నప్పుడు అక్కడ అంతా విషాద తరంగాలు అంటే నెగెటివ్ వైబ్రేషన్స్ వున్నపుడు చేసుకునే వినోదం కానీ, శుభకార్యం కానీ కలిసిరావు. జయం కలగవు సరికదా! ఒక్కోసారి అలాంటి వివాహాలు, గృహ ప్రవేశాలు వికటిస్తాయి కూడా. అందుచేత ఎవరూ విషాదంలో వినోదించరు.

అంటే ఇక్కడ ముఖ్యంగా గమనించవలసింది **"ఒకరి విషాదంతో వినోదించడమన్నది విషాదానికే దారితీస్తుంది తప్ప వినోదాన్ని కలిగించదు".**

అందుకే పత్రీజీ **"వినోదించి వినోదించాలి కానీ విషాధంతో వినోదించకూడదు"** అంటారు. కానీ ప్రస్తుతం సమాజంలో గమనిస్తే అంతా ఇతరుల విషాదంతో వినోదించటానికే ప్రయత్నిస్తున్నారు.

ఎందుచేతనంటే భగవంతుని సృష్టిలో భగవంతునికి ప్రతీ ప్రాణీ సమానమే. అంటే మానవునితో పాటు ప్రతీ జంతువు ఒక్కటే. కారణం మానవునిలాగే ప్రతీ జంతువుకు నొప్పి, బాధ వుంటాయి. బాధను అరుపుల ద్వారా వ్యక్తం చేస్తాయి. మానవుల్లానే ప్రతిఘటిస్తాయి. అంతేకాదు మానవుని లాగే అవి కూడా సుఖాన్నే కోరుకుంటాయి. అలాగే జంతువులకు కూడా మానవుల మాదిరిగానే పుత్రవాత్సల్యం. తమ పిల్లల పట్ల మమకారం వుంటాయి. ఇది మనం సృష్టిలో గమనిస్తే తెలుస్తుంది. అంటే జంతువులకు విషాదం కలిగినా అక్కడ విషాద తరంగాలు అంటే నెగెటివ్ వైబ్రేషన్స్ ఏర్పడతాయి.

అలాంటి జంతువులను మానవుడు 'దయ' లేకుండా ఫంక్షన్లని, పార్టీలని తన వినోదం కోసం క్రూరంగా చంపి వాటి మాంసాన్ని తింటున్నాడు. జంతువులకు విషాదాన్ని కలిగిస్తున్నాడు. అంటే వాటి విషాదంతో తాను వినోదిస్తున్నాడు. కానీ ఇక్కడ మానవులకు తెలియకుండా ఆ జంతువుల విషాదంతో అక్కడ నెగెటివ్ వైబ్రేషన్స్ అంటే విషాద తరంగాలు ఏర్పడతాయి. ఆలోచిస్తే ఇలాంటి వినోదం మానవునికి క్షేమకరం కాదు, లాభదాయకం కాదు. అలాంటి వినోదం

చేసుకున్నందుకు అందులో పాల్గొన్నందుకు మానవులు చివరకు తమ జీవితంలో కూడా విషాదాన్నే చవిచూడవలసి వస్తుంది.

ఆలోచించండి ఒకరు చస్తేనే అరిష్టమని వేడుక ఆపేస్తామే! మరి ఎన్నో జీవులను చంపి వేడుక ఎలా చేసుకుంటాం? అలాంటి వేడుక ఎలా శుభకరం? లాభకరం? ఆనందదాయకం? ఆ జంతువులు రోదించవా? వాటి బంధువులు దుఃఖించరా? చూడండి ఒక కాకి చనిపోతే మిగతా కాకులన్నీ ఆహారం తినడం మానివేసి ఎలా రోదిస్తాయో! ఏడుస్తాయో!

అందుచేత శుభకార్యాలు, పండగులు, వేడుకలు, జరుపుకోవాలని అనుకున్నపుడు ఎవరినీ, ఏ ప్రాణినీ విషాదానికి గురి చెయ్యవద్దు. దుఃఖాన్ని కలిగించవద్దు. అందరినీ, అన్నిటిని సంతోషపరచాలి. ఆనందాన్ని కలిగించే పనులు చెయ్యాలి. అలాంటివే మనకు శుభకరం.

అందుకే శుభకార్యాలకు వచ్చిన వారికి వెళ్ళేటపుడు ఏదో ఒక కానుక అంటే బహుమతి ఇవ్వటం ఆనవాయితీ. కనీసం ఒక పండైనా ఇస్తారు. అంతేకాదు పని వారికి, సేవలు చేసే వారికి కానుకలు ఇచ్చి సంతోషపరుస్తారు. ఆనంద పరచడమే దీని ఉద్దేశ్యం. అది వేడుక చేసుకున్న వారికి శుభకరం, లాభదాయకం అని భావించబట్టే అలా చేస్తారు.

మానవులు ఎంతసేపూ ఏ విషయమైనా మానవుల వరకే ఆలోచిస్తారు. జంతువులను లెక్కలోకి తీసుకోరు. కానీ జంతువులు కూడా మానవులలాగే భగవంతుని సృష్టిలోని ప్రాణులే! భగవంతుని రూపాలే! అందుచేత భగవంతునికి అన్నీ సమానమే. అందుచేత ఏ ప్రాణికి విషాదాన్ని కలిగించినా వారికి శుభకార్యం ద్వారా వారు పొందాలనుకున్న లాభాన్ని పొందలేరు సరికదా చివరకు నష్టాన్నే పొందుతారు.

అందుచేత జంతువుల హింసతో వేడుకలు చెయ్యకూడదు. ఒకవేళ ఎవరైనా అలాంటి వేడుకలు చేస్తుంటే అంటే మాంసాహారంతో విందులు చేస్తుంటే పాల్గొన కూడదు. కారణం పాల్గొన్న వారు కూడా ఆ 'అశుభం'లో పాత్రధారి అవుతారు. అందుచేత నిర్మొహమాటంగా అలాంటి వారితో చెప్పాలి. నాకు అలాంటి వేడుక వద్దు. నేను అలాంటి విషాదంతో కూడుకున్న విందులలో పాల్గొనని చెప్పాలి.

కారణం అక్కడ జరిగేది భగవత్స్వరూపాలైన జీవుల మీద జరిగే హింస. మనకు 'లోకుల' కంటే 'లోకేశుడే' ముఖ్యం. **"లోకులు ఏమనుకుంటారోనని పాల్గొనడం కాదు లోకేశుడు అంటే భగవంతుడు ఏమనుకుంటాడోనని ఆలోచించాలి". "లోకులను తృప్తి పరచడం కాదు. లోకేశుడిని ఆనందపరచాలి".** అంతేకానీ వారిని ప్రోత్సహించి, మీరు కూడా పాపంలో భాగస్వాములు కాకండి. పాపకార్యాన్ని సమర్థించకండి.

**పరమాత్మ తనపై దయ కలిగి వుండాలని కోరుకునేవాడు ప్రతి ఒక్కరి పట్ల దయకలిగి వుండాలి.**



# ప్రకృతి వైపరీత్యాలకు కారణం?

మానవుల ధర్మాలలో ఒక ముఖ్య ధర్మం 'ప్రకృతిని కాపాడే ధర్మం'. ఆ **"ధర్మాన్ని మనం కాపాడితే! ఆ ధర్మమే మనల్ని కాపాడుతుంది''. అంటే "ప్రకృతిని మనం కాపాడితే! ఆ ప్రకృతే మనల్ని కాపాడుతుంది!".**

మరి 'ప్రకృతి' అంటే ఎవరు? ఒక రకంగా ప్రకృతి అంటే 'భగవంతుడే'. కారణం ప్రకృతిలో పంచ భూతాలు ఉన్నాయి. అవి "భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం". ఇవన్నీ భగవంతుని నుంచే ఏర్పడ్డాయి. అలాగే సకల చరాచర సృష్టి, పంచభూతాల నుండి ఏర్పడ్డాయి. అందుచేత ప్రకృతిలో వుండే సకల జీవులు, ప్రాణులు కూడా ప్రకృతిలో భాగమే, అంటే భగవంతుడే.

మనం ప్రకృతిని ప్రేమించాలి. ప్రేమతో చూడాలి. స్నేహం చెయ్యాలి. సహ జీవనం చెయ్యాలి. ప్రకృతి నిర్ణయాలు గౌరవించాలి, కాపాడాలి. అంతేకాని ప్రకృతిని నాశనం చెయ్యకూడదు, ద్వేషించకూడదు, హింసించకూడదు, భాధించకూడదు. ప్రకృతి నిర్ణయాలను విమర్శించకూడదు. ఇదే ప్రకృతి పట్ల మానవుల ధర్మం. దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించినట్లే. అంటే భగవంతునికి విరుద్ధంగా ప్రవర్తించినట్టే. దాని ఫలితం అనుభవించ వలసిందే.

ప్రకృతిలో భాగమైన వృక్ష జాతి పంచభూతాలలోని నీటితో ఏర్పడింది. అలాగే క్రిమి కీటకాలు, సర్ప జాతి "భూమి, అగ్ని"లతో ఏర్పడింది. పక్షి జాతి "నీరు, అగ్ని, వాయువులతో" ఏర్పడింది. జంతుజాతి "భూమి, నీరు, అగ్ని, వాయువులతో" ఏర్పడింది. అలాగే మానవజాతి "పంచభూతాలతో" ఏర్పడింది. అంటే ప్రకృతి, ప్రకృతిలో వున్న సమస్త జీవులు ప్రకృతిలో భాగమని మనకు తెలుస్తుంది. అందుచేత ఎవరిని హింసించినా అంటే ఏ జీవిని, ఏ ప్రాణిని, ఏ జంతువును, ఏ మానవుని హింసించినా ప్రకృతిని హింసించినట్టే.

కానీ మానవులు ఇది గుర్తించక తమ స్వార్థం కోసం, తమ ఆధిపత్యం

కోసం తుచ్ఛమైన తమ కోరికలు నెరవేర్చుకోవడం కోసం ప్రకృతిని, ప్రకృతిలోని జీవులను నిత్యం ఎన్నో రకాలుగా హింసిస్తున్నారు. ప్రతీరోజు తమ ఆనందం కోసం, తమ రుచి కోసం ఎన్నో లక్షల జంతువులను క్రూరంగా చంపి భక్షిస్తున్నారు. రక్తపాతం సృష్టిస్తూ ప్రకృతికి బాధ కలిగిస్తున్నారు. చెట్లను, అడవులను తమ ఇష్టానుసారం నరుకుతూ నాశనం చేస్తున్నారు. సముద్రంలో స్వేచ్ఛగా విహరిస్తున్న జీవులను పట్టి భక్షిస్తు న్నారు. జంతువుల మధ్య పోటీలు పెట్టి, అవి బాధపడుతుంటే తాము వినోదిస్తున్నారు. పక్షులను, చిలుక లను పంజరాలలో పెట్టి, చేపలను తొట్టెలలో పెట్టి, తమ ఆనందం కోసం వాటికి స్వేచ్ఛ లేకుండా చేస్తున్నారు.




అంతేకాదు సాటి మానవులను, బలహీనులను, స్త్రీలను హింసిస్తున్నారు. దౌర్జన్యం చేస్తున్నారు. అమాయకులను, సామాన్యులను మోసగిస్తున్నారు. అలా ఎక్కడ చూసినా ప్రకృతి మీద హింస, దౌర్జన్యాలు పెరిగిపోయాయి. మోసాలు, గుండాయిజం పెరిగిపోయాయి. ఎవరికి వారు తమ గురించి చూసుకుంటు న్నారు కానీ ఇతరుల గురించి ఆలోచించడం లేదు. అందరూ తమ లాంటి వారే. అన్ని జంతువులు తమ లాంటివేనని ఆలోచించడం లేదు. అలా ప్రకృతి మీద హింస రోజు రోజుకూ అనేక రకాలుగా పెరిగిపోయింది.

ఎవరూ ప్రకృతి గురించి ఆలోచించడంలేదు. అసలు ప్రకృతి అంటే ఎవరు? ప్రకృతి పాత్ర ఏమిటి? ప్రకృతి వల్ల ప్రయోజనమేమిటి? ప్రకృతి వల్ల తాను పొందుతున్న లాభాలేమిటి? ప్రకృతి పట్ల తన ధర్మం ఏమిటి? అని ఎవరూ ఆలోచించడం లేదు. ప్రకృతి పట్ల తన ధర్మం నిర్వర్తించకపోతే ఏం జరుగుతుంది? వాటి వల్ల తనకు కలిగే నష్టం ఏమైనా వుందా? వుంటే ఎలా వుంటుంది? అసలు మానవులు ఇవేమీ లోచించడం లేదు. కానీ ఆలోచించాలి.

ఎందుచేతనంటే ప్రకృతి మానవులకు తల్లిలాంటిది. తల్లివడిలో బిడ్డలా మానవులు ప్రకృతిలో వడిలో జీవిస్తున్నారు. మనమంతా ప్రకృతికి తల్లి వడిలో వుండే పసిపిల్లలలాంటి వారం. పిల్లలకు తల్లి అన్ని అవసరాలు ఎలా చూస్తుందో ప్రకృతి తల్లి మనకు అన్నీ సమకూరుస్తుంది. మన అవసరాలకు, ఆనందాలకు కావలసినవన్నీ సమకూరుస్తుంది.

తల్లిపాలిచ్చి, ఆకలి తీర్చి, బొమ్మలతో ఆడిస్తూ ఆనందపరుస్తుంది. పిల్లవాడి ఆనందం చూసి పరవశించిపోతుంది. ముద్దాడి మురిసిపోతుంది.

అలాగే ప్రకృతి తల్లి తన అందాలైన హిమాలయాలు, జలపాతాలు, నదులు, రమణీయ దృశ్యాలు లాంటి వాటితో మనల్ని ఆనందపరుస్తుంది. సస్యాలు, పళ్ళు, కాయగూరలతో ఆకలి తీరుస్తుంది. నీటిని ఇచ్చి దాహం తీరుస్తుంది. గాలిని ఇచ్చి హాయిని చేకూరుస్తుంది. పుష్కలమైన పంటలు ఇస్తుంది. సకాలంలో వర్షాలు కురిపిస్తుంది. చెట్లు, మొక్కలు, విరగ కాసేటట్లు చేస్తుంది. పూసేటట్లు చేస్తుంది. అందరూ ఆనందంగా వుంటే మురిసిపోతుంది. అంతా తనని ప్రేమిస్తుంటే పరవశించిపోతుంది.

తల్లిపాలు త్రాగితే తల్లి ఆప్యాయంగా నిమురుతుంది. కానీ తల్లిపాలు త్రాగుతూ రొమ్ము కొరికితే, గుద్దితే తల్లి ఆగ్రహిస్తుంది. దండిస్తుంది. పిల్లవాని చర్యలు మితి మీరితే పాలే ఇవ్వనంటుంది. అపుడు పిల్లవాడు తల్లడిల్లుతాడు.

అలాగే మన విపరీత చేష్టలు అంటే జీవహింస, మాంసభక్షణ లాంటివి చేస్తే జీవులు కూడా ప్రకృతిలో భాగాలే కాబట్టి ఆ బాధను భరించలేనపుడు ప్రకృతి తన ఆగ్రహాన్ని వైపరీత్యాల ద్వారా అంటే భూకంపాలు, వరదలు, సునామీలు, తుఫానులు, అడవుల దహనం లాంటి వాటి ద్వారా మనకు బుద్ధి చెబుతుంది. వర్షాలు పడవు. కరువు, కాటకాలు ఏర్పడతాయి. మానవులు తల్లడిల్లుతారు. అందుచేత భూమి మీద వున్న చరాలు కానీ, అచరాలు కానీ ప్రకృతిలో భాగమే. వేటినీ హింసించకూడదని తెలుసుకోవాలి. అన్నిటినీ ప్రేమించాలి. అవసరాలకు ఉపయోగించుకుంటూ, అంతవరకు మాత్రమే పరిమితమవ్వాలని తెలుసు కోవాలి.

పాలు త్రాగితే తల్లి చనిపోదు. తల్లికి బాధకలుగదు. భారం తగ్గుతుంది. అలాగే చెట్లకున్న పళ్ళు, కూరగాయలు కోస్తే చెట్లు చనిపోవు. చెట్ల భారం తగ్గుతుంది. అందుచేత కూరగాయలు, పళ్ళు కోసుకోండి. కానీ చెట్లను నరకకండి. కొమ్మలు విరవకండి. పూలను కోయకండి. అన్ని విషయాలలో అవసరాలకు పరిమితమవ్వండి. పరిమితులు పాటించండి.

**"ప్రకృతిని హింసిస్తే తల్లిని హింసించిన దానితో సమానం".** ప్రకృతి నుండి అన్ని అవసరాలు తీర్చుకుంటూ **"ప్రకృతిలోని వాటిని హింసించడమంటే తల్లి పాలు త్రాగి తల్లి రొమ్ము గుద్దినట్టే".** వాడికంటే ద్రోహి ఎవరూ వుండడు. వాడు శిక్షార్హుడు. అలా భూమి మీద జరుగుతుండడం వల్లే ఈ ప్రకృతి వైపరీత్యాలు జరుగుతున్నాయి.

**"ప్రకృతి వైపరీత్యం అంటే మానవుల బాధలు సహించలేని, ఓర్చుకోలేని ప్రకృతి తల్లి ఆగ్రహించడమే".** తన బిడ్డలను శిక్షించడమే. వారికి బుద్ధి చెప్పడమే. ప్రకృతి వైపరీత్యాలు వస్తున్నాయంటే మానవులు ప్రకృతి పట్ల తమ ధర్మం నిర్వర్తించడం లేదనే అర్థం.

అంతేకానీ ప్రకృతి ప్రకోపించింది, కోపగించింది, కృష్ణమ్మ ఉగ్రరూపం దాల్చింది. మళ్ళీ శాంతిస్తుంది అనుకుంటూ, అదేదో సహజమనుకుంటూ, ప్రకృతిలో అలా అప్పుడప్పుడు జరుగుతాయనుకుంటూ నిర్లక్ష్యంగా మళ్ళీ మళ్ళీ హింస చేస్తుంటే మానవులు మరల ప్రకృతి ఆగ్రహానికి బలి కావలసిందే.



తల్లి అస్తమాను బిడ్డను శిక్షించదు కదా? ఓర్చుకోలేనపుడే శిక్షిస్తుంది. అలాగే ప్రకృతి అస్తమాను తన కోపాన్ని ప్రదర్శించదు. మానవుల ప్రవర్తన మితిమీరినప్పుడే శిక్షిస్తుంది.

ప్రకృతి కోపిస్తే మానవులు విలవిలలాడిపోతారు, ఆర్తనాదాలు చేస్తారు, తట్టుకోలేరు. చూడండి భూమి చిన్నగా కంపించినా అర్థరాత్రి అయినా అంతా ఇళ్ళ నుంచి బయటకు పరిగెత్తుకు వస్తారు. రోడ్ల మీదే నిద్ర లేకుండా భయం, భయంగా గడుపుతారు. అందుచేత గుర్తుంచుకోండి, ప్రకృతి పట్ల మన ధర్మాన్ని తెలుసుకోవాలి, ప్రకృతిని ప్రేమించాలి, హింసించకూడదు. అంటే జంతువులను చంపకూడదు. మాంసాన్ని తినకూడదు. స్త్రీలను గౌరవించాలి. బలహీనులను, అల్పులను రక్షించాలి. జంతువులపై దయ చూపించాలి. ఇదే ప్రకృతి పట్ల మన ధర్మం.

ఈ ధర్మాన్ని తెలుసుకోవాలన్నా, ఆచరించాలన్నా ఎవరైనా 'ధ్యానం' చెయ్యవలసిందే. 'ధ్యానం' విశేషంగా చేస్తే ప్రకృతి గురించి ప్రకృతి ధర్మాల గురించి తెలుసుకోగలుగుతారు. ప్రకృతికి అనుగుణంగా జీవించగలుగుతారు. ప్రకృతి అంటే భగవంతుని సహకారంతో ఆనందంగా జీవించగలుగుతారు.

**పరమాత్మ ఇచ్చిన బుద్ధిని ఉపయోగించనివాడు**
**మనిషి రూపంలో వున్న పశువు**

# సృష్టి సిద్ధాంతం : ఇస్తే వస్తుంది! - ఇవ్వకపోతే రాదు!

లోకంలో చాలా మంది ఎన్నో కోరుకుంటారు. ఎన్నో వద్దనుకుంటారు.

కానీ చూస్తే కావాలనుకున్నవి రావు. అలాగే వద్దనుకునేవే వస్తుంటాయి. దీనికి ముఖ్య కారణం, మానవులు సృష్టి సిద్ధాంతాలు, సృష్టి ధర్మాలు, తెలుసుకోకపోవడం, ఆ రకంగా ప్రవర్తించకపోవడం, పైగా విరుద్ధంగా ప్రవర్తించడం.

సృష్టిలోని ఒక సిద్ధాంతం ఏమిటంటే "ఇస్తే వస్తుంది, ఇవ్వకపోతే రాదు".

చాలామంది ధనం కోరుకుంటారు కానీ ఇవ్వరు. అందుకే వారికి ధనం రాదు. అలాగే భర్త నుంచి భార్య, భార్య నుంచి భర్త, ప్రేమ, ఆప్యాయత కోరుకుంటారు. కానీ తాము మాత్రం ఇవ్వరు. అందుకే ఎదుటి వారి నుంచి అవి రావు. అలాగే అందరి చేతా గౌరవింపబడాలని, అవమానింప బడకూడదని కోరుకుంటారు. కానీ తాము అలా ప్రవర్తించకపోవడం వల్లఅవి కూడా రావు.

దీనికి ముఖ్య కారణం వారు కోరుకునేవి ఏవీ ఇవ్వరు. పైగా వాటికి విరుద్ధమైనవే ఇస్తూంటారు. అందుకే వారు కోరుకున్నవి రావు, వాటికి విరుద్ధమైనవే వస్తాయి. అంటే వారు ఏది ఇస్తే అదే పొందుతూంటారు.

అలాగే అంతా అందరి నుంచి ప్రేమను ఆశిస్తారు. హింసింపబడ కూడదనుకుంటారు. కానీ వారు ఎవరినీ ప్రేమించరు. ఎవరికీ ప్రేమను పంచరు. పైగా జీవులను, జంతువులను హింసిస్తారు. వాటి హింసకు కారకులవుతారు. మాంసం, గుడ్లు తింటారు. వారి జీవితంలో సంసారంలో హింసను అనుభవిస్తారు, బాధపడుతుంటారు. ఇక్కడ విచిత్రమేమిటంటే వారు తమ వారిని హింసించకపోయినా, వారి చేతే హింసించబడతారు. ఇది వారికి అర్థం కాదు.

దీనికి ముఖ్య కారణం వీరు సృష్టి సిద్ధాంతాన్ని అర్థం చేసుకోక పోవడమే. కారణం సృష్టిలో అంతా ఒక్కటే. అంతా భగవంతునిలో భాగాలే. అందుచేత ఏ భాగానికి హింస కలిగించినా సృష్టిలోని మరొక భాగంచే హింసింపబడవలసి వస్తుంది.

కోడి, మేక, చేప అన్నీ భగవంతునిలో భాగాలే. వాటిని తినడం వల్ల, హింసించడం వల్ల సృష్టిలో మరొక భాగమైన తమ వారితో కానీ వేరొకరితో

కానీ హింసింపబడతారు. ఇది సృష్టి గురించి అవగాహన లేని వారికి అర్థం కాదు. ఆత్మజ్ఞానం లేని వారికి అర్థం కాదు.

చిన్న ఉదాహరణ చూద్దాం. మీ శరీరాన్నే తీసుకోండి. చూస్తే శరీరమంతా మీదే. శరీరంలోని వివిధ భాగాలూ మీవే. మీ కాలును దోమకుడితే బాధ కాలుకు కలుగుతుంది. కానీ సంబంధం లేని మీ చెయ్యి ఆ దోమను చంపుతుంది, శిక్షిస్తుంది. బాధింపబడిన కాలు ఏమీ చెయ్యదు, ప్రతీకారం తీర్చుకోదు. కారణం అన్నీ మీరే కనుక.

అలాగే అన్నీ భగవంతుని రూపాలే! భాగాలే! కాబట్టి కోడిని మీరు హింసిస్తే దానికి ప్రతిగా సంబంధం లేని వారితో మీరు హింసింపబడతారు. కారణం సృష్టికి హింస ఇచ్చారు. సృష్టి నుంచి హింసనే తీసుకున్నారు. అంటే సృష్టి సిద్ధాంతం ప్రకారం "ఇచ్చిందే వస్తుంది. ఇవ్వకపోతే రాదు". అందుచేత వేటినీ హింసించవద్దు. అన్నిటిని ప్రేమించండి. అప్పుడు ఎవరూ మిమ్మల్ని హింసించరు. పైగా అంతా మిమ్మల్ని ప్రేమిస్తారు కూడా.

భక్త రామదాసును చూడండి. ఆయన రామచిలుకను పంజరంలో బంధించాడు. వేరొకరిచే తాను జైలులో బంధించబడ్డాడు.

ఇదే సృష్టిలోని రహస్యం, గొప్పతనం కూడా. అంతే కాదు సృష్టి గురించి అవగహన చేసుకుంటే ఇంకా ఎన్నో లాభాలు పొందవచ్చు. ఎలాగంటే జంతువుల మీద హింస జరగకుండా మీరు ఆపితే! అంటే ఎవరి చేతనైనా మాంసభక్షణ మాన్పించగలిగితే ఒకరకంగా జంతువుల మీద జరిగే హింసను ఆపినట్టేగా! అపుడు మీ మీద హింసజరగకుండా ఎవరో ఒకరు ఆపుతారు. ఇదే సృష్టిలోని గొప్పతనం.

అలాగే హింస జరుగుతున్నప్పుడు చూస్తూ వూరుకుంటే మీ మీద కూడా హింస జరుగుతూ వున్నా అందరూ ప్రేక్షకుల్లా చూస్తూ వూరుకుంటారు. అందుచేత జీవితంలో హింస వద్దనుకుంటే హింస చేయకూడదు. హింసను ఆపే ప్రయత్నం కూడా చెయ్యాలి. అలాగే 'దయ' కోరుకుంటే 'దయ' చూపించాలి.

అలా ఇవ్వగలగాలన్నా, ఇచ్చే శక్తి రావాలన్నా ముఖ్యంగా సాత్వికమైన శాకాహారం తీసుకుంటూ ధ్యానం చెయ్యాలి. అలా ధ్యానశక్తి పెరిగే కొద్దీ ఇచ్చే గుణం వస్తుంది. మెల్లిగా భగవంతుని సృష్టిని అర్థం చేసుకుంటారు. సృష్టి సిద్ధాంతాలు, ధర్మాలు పాటిస్తారు. జీవితంలో నష్టపోరు. పైగా లాభం కూడా పొందగలుగుతారు.



# మానవులకు శాకాహారం పాపమా?

మాంసాహారం మానవుల ఆహారం కాదు. అది తినకూడదు, పాపం అని అనగానే చాలా మంది మొక్కలలో కూడా ప్రాణం వుంది కదా? మరి శాకాహారం తిన్నా పాపమే కదా? అని ప్రశ్నిస్తారు. కాని ఈ విషయం, మానవులు తప్పనిసరిగా ఆలోచించాలి. కారణం మానవ శరీరం శాకాహార నిర్మితమే కాని మాంసాహార నిర్మితం కాదు. అంటే శాకాహారానికి అనుకూలం కానీ, మాంసాహారానికి అనుకూలం కాదు. ఇది సృష్టిలో వున్న ఏర్పాటు. అంటే భగవంతుడు చేసిన ఏర్పాటు.

అందుచేత ప్రకృతి అంటే భగవంతుడు నిర్దేశించిన దానికి అనుగుణంగా తీసుకునే ఆహారాన్ని భక్ష్యము అంటారు. ప్రకృతి నిర్దేశించిన దానికి విరుద్ధంగా తీసుకునే ఆహారం అభక్ష్యం అంటారు. భక్ష్యం అంటే తినదగినది. అభక్ష్యం అంటే తినకూడనిది.

ఏ జీవి అయినా జీవించాలంటే ఆహారం తప్పనిసరి. ఆహారం లేకుండా ఏ జీవి జీవించలేదు. పుట్టిన క్షణం నుంచే ప్రతీ ప్రాణి జీవితం ఆహారంతో మొదలవుతుంది. అంతేకాదు జీవితం అంతం అయ్యే వరకు ప్రతీరోజూ ఆహారం తీసుకోవడం తప్పనిసరి. ఆహారం తీసుకోవడం ప్రకృతి ధర్మాలలో ఒక ధర్మం.

మానవులే కాదు సమస్త జీవులు కూడా ప్రకృతిచే సృష్టింపబడినవే. ప్రకృతి అంటే భగవంతుడు.

ప్రకృతి సమస్త జీవులను సృష్టి చేయడమే కాదు. ఏ ప్రాణి ఏ ఆహారం తీసుకోవాలో కూడా ప్రకృతే నిర్దేశించింది. దానికి అనుగుణంగానే వాటి శరీర నిర్మాణం కూడా చేయడం జరిగింది. ప్రకృతి కొన్ని జీవులకు శాకాహారం భక్ష్యంగా నిర్దేశించి, దానికి అనుగుణంగా వాటి శరీర నిర్మాణం చేయడం జరిగింది. అలాగే కొన్ని జంతువులకు మాంసాహారం భక్ష్యంగా నిర్దేశించి దానికి అనుగుణంగా వాటి శరీర నిర్మాణం చేయడం జరిగింది. అందుచేత శాకాహార జీవులకు మాంసాహారం 'అభక్ష్యం'. మాంసాహార జీవులకు

శాకాహారం 'అభక్ష్యం'. అలాగే శాకాహార నిర్మితమైన శరీరం కల మానవులకు మాంసాహారం 'అభక్ష్యం'. అంటే తినకూడదు. కానీ మానవుడు అభక్ష్యాన్నే భుజిస్తూ కష్టాల పాలవుతున్నాడు. జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటున్నాడు.

కొంచెం గమనిస్తే ప్రకృతి శాకాహార జీవులకు, మాంసాహార జీవులకు వాటి శరీర నిర్మాణంలో ఎన్నో తేడాలు చూపించడం జరిగింది.

మాంసాహార జంతువులైన పులి, సింహం లాంటి వాటికి దంతాలు వుండవు. వాటికి బలిష్టమైన కోరలు, వాడి గోళ్ళు వుంటాయి. వాటితో ఏ ఆయుధం వుపయోగించకుండా జంతువులను చంపగలవు, వాటి చర్మాన్ని చీల్చగలవు. వాటి పచ్చి మాంసాన్ని ముక్కలు చేసి తినగలవు. అవి మాంసాన్ని నమలవు, మింగుతాయి. అలా నమలకుండా మాంసం ముక్కలను మింగగలవు. మింగినా వాటిని అరిగించుకోగలవు. భగవంతుడే వాటికి ఆ ఏర్పాటు చేశాడు.

అంతేకాదు అవి జంతువుల రక్తాన్ని నాలికతో నాకి ఇష్టంగా ఆస్వాదిస్తాయి. **"వాటికి రక్తం అసహ్యం కాదు, మాంసం ముక్కలు మింగటం కష్టం కాదు".** మాంసాన్ని మెత్తగా నమలవలసిన పనిలేదు. నమలకపోయినా అరిగే ఏర్పాటు ప్రకృతిలో వాటికి ఇవ్వబడింది. వాటి శరీరం దానికి అనుగుణంగా తయారు చేయబడింది. అందుకే వాటి జీర్ణకోశం చాలా కురచగా వుంటుంది. ఆహారాన్ని ఆరగించే లాలాజలంలో హైడ్రోక్లోరిక్ ఆమ్లం ఎక్కువగా వుండడం వల్ల త్వరగా మాంసం ముక్కలు అరుగుతాయి. వ్యర్థం బయటకు విసర్జింపబడుతుంది. ఈ ఏర్పాటు శాకాహార జీవులకు లేదు.

శాకాహార జంతువులకు దంతాలు వుంటాయి, ఆహారాన్ని నమిలి మింగుతాయి. అంతేకాదు మాంసాహార జంతువులు నీటిని నాలికతో కతుకుతూ త్రాగుతాయి, కానీ శాకాహార జంతువులు నీటిని నోటితో పీల్చుకుని త్రాగుతాయి. మాంసాహార జంతువులు రాత్రిళ్ళు కూడా చూడగలవు కానీ శాకాహార జంతువులు రాత్రిళ్ళు చూడలేవు.

మాంసాహార జంతువులు శాకాహారం ముట్టవు, వాటి జీవిత కాలం పూర్తిగా పచ్చిమాంసం తినే జీవిస్తాయి. శాకాహార జంతువులు మాంసాహారం ముట్టవు, వాటి జీవితకాలం శాకాహారంతోనే జీవిస్తాయి. ఒకవేళ శాకాహారం దొరకకపోతే కృంగి, కృశించి చనిపోతాయే కానీ మాంసం మాత్రం ముట్టుకోవు.

పై విషయాలు గమనిస్తే శాకాహార జంతువులు ప్రకృతి అంటే భగవంతుడు నిర్దేశించిన ఆహారాన్నే తీసుకుంటాయి. అంటే ప్రకృతికి అనుగుణంగా జీవిస్తాయి. అంతే కానీ ప్రకృతి విరుద్ధంగా జీవించవు. అలాగే

మాంసాహార జంతువులు కూడా ప్రకృతి నిర్దేశించిన దానికి అనుగుణంగానే జీవిస్తాయి అన్నది వాటిని గమనిస్తేనే తెలుస్తుంది.

కానీ మానవుడే ప్రకృతి అంటే భగవంతుడు నిర్దేశించిన దానికి విరుద్ధంగా ఆహారం తీసుకుంటున్నాడు. ఎందుచేతనంటే మానవుని శరీరం శాకాహార నిర్మితమే కానీ మాంసాహార నిర్మితం కాదు. కారణం మానవుడు ఏ ఆయుధం ఉపయోగించకుండా జంతువులను చంపలేడు. ఏ ఆయుధం ఉపయోగించకుండా వాటి చర్మాన్ని చీల్చలేడు. అలాగే ఆ జంతువు మీద పడి వాటి పచ్చి మాంసాన్ని నోటితో చీల్చుకుని తినలేడు. అంతేకాదు శాకాహారం కలపకుండా ఉత్తి పచ్చిమాంసం తినలేడు. పచ్చిమాంసం మాత్రమే తింటూ ఎంతో కాలం జీవించలేడు. కానీ శాకాహారం తీసుకుంటూ జీవితకాలం జీవించగలడు. అందుచేత మానవునకు శాకాహారమే భక్ష్యం. మాంసాహారం అభక్ష్యం.

కానీ మానవులు ఇది అర్థం చేసుకోలేక మాంసాహారం భుజిస్తున్నారు. పైగా తమ పనిని సమర్థించుకుంటున్నారు కూడా. మొక్కలలో ప్రాణం లేదా? అని వాదిస్త వుంటారు. ఈ వాదనలన్నీ తాము చేసే పని సమర్థించుకోవటానికి, ఏదో రకంగా అలవాటు పడిన మాంసం తినటానికి తప్ప ఇంకేమీ కాదు.

ఎందుచేతనంటే సృష్టిలో ప్రాణం లేనిదంటూ ఏదీ లేదు. కానీ ప్రతీ జీవి ఆహారం తీసుకోవడమన్నది ప్రకృతి ధర్మం. కానీ ప్రకృతిని నడిపించే భగవంతుడు ఏ జీవి, ఏ ఆహారం తీసుకోవాలో తానే నిర్దేశించాడు. భగవంతుడు నిర్దేశించిన దానికి అనుగుణంగా ఎవరు ప్రవర్తించినా, జీవించినా, అది ప్రకృతి విరుద్ధంగా కాదు, పాపం కాదు . ఇది ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవాలి. అలా భగవంతుడు మానవ శరీరాన్ని శాకాహారానికి అనుగుణంగానే నిర్మించాడు. అందుచేత మానవుడు శాకాహారాన్నే తీసుకోవాలి. అదే మానవునకు భక్ష్యం. అంటే పాపం కాదు. మాంసాహారం మానవునకు అభక్ష్యం. అంటే భగవంతుడు నిర్దేశించిన దానికి విరుద్ధం. అంటే పాపం.

ధ్యానం విశేషంగా చేస్తే ఆలోచించగలరు. ఈ తేడాలు అర్థం చేసుకోగలరు. ప్రకృతి సహజ సిద్ధంగా జీవించగలరు.

**ప్రకృతి నిర్ధేశించిన పరిధులను ఉల్లఘించడమంటే నిజానికి పరమాత్మ ఆజ్ఞను ధిక్కరించడమే?**



# భగవద్గీతను బట్టి మానవుని ఆహారం శాకాహారమా? మాంసాహారమా?

భగవంతుడు మానవ శరీరాన్ని శాకాహారానికి అనుకూలంగా నిర్మించాడు. మాంసాహారానికి అనుకూలంగా నిర్మించలేదు. అందుకే మానవుడు ఏదో ఒక ఆయుధం వుపయోగించి మాత్రమే ఏ జంతువునైనా చంపగలడు. అలాగే ఆయుధంతో మాత్రమే చర్మాన్ని, మాంసం నుంచి వేరు చెయ్యగలడు. అలాగే ఒక చాకో, కత్తితో మాత్రమే మాంసాన్ని ముక్కలు చెయ్యగలడు. గమనిస్తే మాంసం దుకాణంలో కత్తితో జంతువు శరీరం లోని మాంసాన్ని ముక్కలుగా చేసి వినియోగదారుడికి అంటే తినే వాడికి అమ్ముతాడు. వినియోగదారుడు కూడా ఆ మాంసం ముక్కలు వండేటపుడు కత్తితోకాని, చాకుతోకాని, ఇంకా చిన్న,చిన్న ముక్కల క్రింద కోసి ఆ ముక్కలను మెత్తగా మారేటట్లు వుడకపెడతారు. వాటి నుంచి వాసన, కంపు రాకుండా వుండటానికి వాటిపై మషాలాలు, కారం, ఉప్పు చల్లుతారు. ఇన్ని చేసినా తినలేరు కాబట్టి, వాటిలో శాకాహారం కలుపుతారు. ఇలా చేయకుండా మానవుడు మాంసాన్ని తినలేడు. మాంసాహార జంతువులా పచ్చి మాంసం ముక్కలు మింగలేడు.

అలా వండిన మాంసాన్ని మానవుడు తన దంతాలతో బాగా నమలాలి. నమిలితే కాని ఆ ఆహారాన్ని మానవుడు మింగలేడు. ఒకవేళ నమలకుండా మింగినా, తిన్న ఆహారం అరిగించుకోలేడు. అరగదు కూడా! అంటే శాకాహారి అయిన మానవుడు నమలాలి, అలా నమలటానికి దంతాలు కూడా ఇవ్వబడ్డాయి. ఆ దంతాలతో ఏ ఆహారాన్నయినా మెత్తగా చూర్ణం చేసి మింగాలి. ఇదే సృష్టిలో శాకాహారులకు వున్న ఏర్పాటు.

ముఖ్యంగా గుర్తుంచుకోవలసింది మానవునకు దంతాలు వున్నాయి. మాంసాహార జంతువులకు దంతాలు లేవు. అందుచేత మానవుడు శాకాహారేకాని మాంసాహారి కాదు. శాకాహారమే మానవునకు యుక్తము కాని, మాంసాహారం కాదు. అందుచేత శాకాహారమే తీసుకోండి. ఇది మానవునకు ప్రకృతి సహజ సిద్ధమైన ఆహారం. భగవంతుడు నిర్దేశించినది.




**పరమాత్మ ఎవరికి ఏ ఆహారం నిశ్చయించాడో అదే పవిత్రమైనది.**

ఈ విషయం భగవద్గీతలో కూడా ఉదహరించబడింది. భగవద్గీతలో ఇవ్వబడిన ఈ క్రింది శ్లోకం చూద్దాం.

**శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రిత:**
**ప్రాణాపాన సమాయుక్త: పచామ్యన్నం చతుర్విధమ్. (భ.గీ 15-14)**

తా:- నేను 'వైశ్యానరుడను' జఠరాగ్నిగా ప్రాణుల యొక్క శరీరమును ఆశ్రయించి ప్రాణము, అపాన వాయువులతో కూడుకొని, నాలుగు విధములగు అన్నమును పచనము చేయుచున్నాను.

ఇక్కడ భగవానుడు మానవులు తీసుకునే నాలుగు రకాలయిన ఆహారాన్ని పచనము చేసేది కూడా నేనే అని చెపుతున్నారు. మరి ఆ నాలుగు రకాల, ఆహారాలు ఏమిటో చూద్దాం.

1) భక్ష్యము:-దంతములచే కొరికి తినే కఠిన పదార్ధములు, పిండివంటలు, కూరగాయలు, పళ్ళు మున్నగునవి.

2) భోజ్యము:- నాలుకచే చప్పరించి మ్రింగే మెత్తటి పదార్ధములైన అన్నము మొదలగునవి.

3) లేహ్యము:- నాలుకచే రుచి చూడబడు పచ్చళ్ళు మొదలగునవి.

4) చోష్యము:- నోటిచే జుర్రబడు పాయసము, చారు, మజ్జిగ మొదలగునవి.

పై దానిని బట్టి మనం గ్రహించవలసింది 4 రకాల ఆహారాలలో దంతాలు ఉపయోగించి తీసుకునే ఆహారం కూడా వుంది. ఆ ఆహారమే శాకాహారం. మరి దంతాలు ఎవరికి వున్నాయి? శాకాహార జీవులకు మాత్రమే వున్నాయి. శాకాహార జీవులు శాకాహారాన్ని తప్పనిసరిగా దంతాలు ఉపయోగించి మాత్రమే తీసుకొనగలవు. అందుచేత దంతాలు వున్నవన్నీ శాకాహారులే.

ప్రతి జీవికీ ఆహారం భగవంతుని సృష్టిలో తప్పనిసరి అవసరం. ఏ జీవి జీవించాలన్నా ఆహారం తీసుకోవలసిందే. ఆహారం తీసుకోకుండా ఏ జీవి తన జీవిత కాలం జీవించలేదు. అందుచేత **భగవంతుని సృష్టిలోని ఏ**

**ప్రాణి అయినా ఆహారం తీసుకోవడం పాపం కాదు. కాని ఎవరు ఏ ఆహారం తీసుకోవలన్నదే ముఖ్యం.** ఎవరు ఏ ఆహారం తీసుకోవాలో భగవంతుడే నిర్దేశించాడు. అందుకే దానికి అనుగుణంగానే వాటి శరీరాలు నిర్మించాడు.

మాంసాహారులైన పులి, సింహం శాకాహారం తినవు, తినలేవు కూడా! అంతేకాదు అవి పచ్చి మాంసం మాత్రమే తింటూ తమ జీవితకాలం జీవించగలవు. అలాగే మానవుడు పచ్చి మాంసం తింటూ రెండు, మూడు వారాలకు మించి జీవించలేడు. కాని శాకాహారం తీసుకుంటూ తన జీవితకాలం జీవించగలడు. అంటే భగవంతుడు మానవులకు నిర్దేసించిన ఆహారం శాకాహారం మాత్రమే.

అందుచేత **దంతాలు వున్న మానవులు శాకాహారం తీసుకోవడం పాపం కాదు. అలాగే దంతాలు లేని పులి, సింహం లాంటివి మాంసం తినడం పాపం కాదు.** అది భగవంతుడు వాటికి నిర్దేశించిన సహజమైన ఆహారం. అందుచేత మొక్కలలో **జీవం వుందా? లేదా? అన్నది ముఖ్యం కాదు. సృష్టికి, సృష్టి నియమాలకు అనుగుణంగా ప్రవర్తించామా? లేదా? అన్నదే ముఖ్యం.** అలా సృష్టికి, సృష్టి ధర్మానికి, అంటే ప్రకృతికి, అంటే భగవంతునికి అనుగుణంగా ప్రవర్తించిన వారికి, జీవించిన వారికి ఎప్పటికి కష్టాలు రావు. దానికి విరుద్దంగా ప్రవర్తిస్తేనే కష్టాలు.

మానవుని ఆహారం శాకాహారమే అని చెప్పడానికి ఈ చిన్న ఉదాహరణ చూడండి. ఎవరైనా మాంసం దుకాణానికి వెళ్ళి శాంపిల్‌గా ఒక మాంసం ముక్కను నోటిలో వేసుకుంటాడా? వేసుకోడు. వేసుకోలేడు కూడా. కానీ పళ్ళ దుకాణంలోని ఒక రేగు పండు, నేరేడు పండు శాంపిల్‌గా నోట్లో వేసుకోగలడు. అలాగే మామిడి పండు ముక్క పుచ్చకాయ, బొప్పాయి ముక్కలు శాంపిల్‌గా కోసి ఇస్తే వేసుకుంటాడు కూడా. దీనిని బట్టి మానవుని సహజ సిద్ధమైన ఆహారం శాకాహారమేనని మనం అర్థం చేసుకోవాలి.

మరొక ఉదాహరణ చూద్దాం. ఒక పిల్లిని, ఒక కోడి పిల్లను, ఒక యాపిల్‌ను ఒక గదిలో వుంచితే పిల్లి కోడి పిల్లను తింటుంది. అలాగే పిల్లి బదులు ఒక చిన్న పిల్లవాడిని ఆ గదిలో వుంచితే ఆపిల్ తింటాడు. కోడిపిల్లను ఒళ్ళో వుంచుకుని ప్రేమగా ముద్దాడతాడు. అంటే దీనిని బట్టి మానవుని సహజ సిద్ధమైన, ఆహారం శాకాహారం అని తెలుసుకోవచ్చు.

అంతేకాదు జీవితమన్నది **"తినడం కోసం మాత్రమే కాదు. జీవిస్తున్నాము కాబట్టి, జీవించాలి కాబట్టి తినాలి".** అందుకే అంటారు. **"తినడం కోసం బ్రతకడం కాదు, బ్రతకడానికి తినాలి"** అలా బ్రతకడానికి మానవులకు శాకాహారం చాలు.

అదే పత్రీజీ భోధిస్తున్నారు. **"మానవుడు తినవలసింది శాకాహారం, చేయువలసింది ధ్యానం"** ఇదే ఆనందమయ జీవనమార్గం.

# మానవులు మాంసం తినకపోతే జంతువులు పెరిగిపోతాయా?

మాంసం తినే వారిని మాంసం తినవద్దని ఎవరైనా చెబితే వెంటనే వారు మన మాంసం తినకపోతే ఆ జంతువులు పెరిగిపోవా? మనం భూమి మీద తిరగగలమా? అవే మనల్ని తినేస్తాయేమో? అని ప్రశ్నిస్తుంటారు. వారు అంతకన్నా ఆలోచించరు. ఈ మాట వినేవారికి నిజమేనేమో అనిపిస్తుంది.

కానీ ఆలోచిస్తే అది అవాస్తవం అని తెలుస్తుంది. ఎందుచేతనంటే కొంచెం ఆలోచించండి. తినకపోతే పెరిగిపోవా? అంటున్నారు. అసలు "పెరిగినవి తింటున్నారా? పెంచి తింటున్నారా?" ఆలోచిస్తే ఖచ్చితంగా వీరంతా తినేవన్నీ పెంచినవే! తినటానికే పెంచుతున్నారు.

చూస్తే చేపలను, రొయ్యలను చెరువులలో పెంచుతున్నారు. కోళ్ళను ఫారాలలో పెంచుతున్నారు. మేకలను, గొర్రెలను మందలుగా పెంచుతున్నారు. నిజంగా అలా పెంచకపోతే పెరుగుతాయా? ఇంతమందికి మాంసం దొరుకుతుందా?

గమనిస్తే పెంచనివి ఏవీ పెరగట్లేదని తెలుస్తుంది. పులి, సింహం, చిరుత, తోడేలు, నక్క లాంటి వాటిని ఎవరూ పెంచటం లేదు. వాటిని ఎవరూ తినడం లేదు మరి పెరుగుతున్నాయా? అడవుల్లోంచి వచ్చి మానవులను తినేస్తున్నాయా? లేదు కదా? దీనిని బట్టి ఏమి అర్థమవుతుంది? పెంచినవే పెరుగుతున్నాయి కానీ, పెంచనివి పెరగటం లేదు. పైగా వన్య మృగాలని దాటి రక్షిస్తున్నారు కూడా!

ఆలోచిస్తే మానవులు తినే జంతువులన్నీ మానవులకు ఉపకారం చేసేవే కానీ అపకారం చేసేవి కావు. అంతే కాదు అవి మానవులను తినలేవు. హాని చెయ్యవు కూడా.

ఆలోచించండి కోళ్ళు ఉదయాన్నే నిద్ర లేపుతాయి. మన ఇంటి చుట్టు ప్రక్కల వుండే క్రిమి కీటకాలను, పురుగులను ఏరివేసి మానవులకు హాని కలగకుండా చేస్తున్నాయి. ఆవులు, గేదెలు, మేకలు పాలు ఇచ్చి మానవుల ఆకలిని తీరుస్తున్నాయి. ఆరోగ్యాన్ని కాపాడుతున్నాయి. పేడ ఎరువుగా, పిడకలుగా ఉపయోగపడుతుంది. గొర్రెలబొచ్చు కంబళ్ళుగా, శాలువాలుగా, దుప్పట్లుగా, ఉన్ని వస్త్రాలుగా మానవులను చలి నుంచి రక్షిస్తున్నాయి. చేపలు చెరువులలోని సూక్ష్మ క్రిములను, దోమల గుడ్లను తింటున్నాయి. అలా నీటిని శుభ్రపరుస్తూ మంచినీరు ఇస్తూ మానవుని ఆరోగ్యాన్ని రక్షిస్తున్నాయి. ఇలా ఆలోచించుకుంటూ పోతే మానవులు తినే జంతువులన్నీ మానవులకు ఉపకారమే చేస్తున్నాయి కానీ అపకారం చేయటం లేదు.

అలాంటి వాటిని తింటూ! క్రూరంగా హింసిస్తూ! పైగా తినకపోతే పెరిగిపోవా? అని తాము చేసే క్రూరమైన పనిని సమర్థించుకుంటున్నారంటే! అసలు వీరిని ఏమనాలి?

అందుచేత కుంటిసాకులు చెప్పకండి. ఆలోచించండి. మానవుడు జీవించడానికి భగవంతుడు శాకాహారం ఇచ్చాడు. శాకాహారం తినండి. అంతేకానీ తాను జీవించడం కోసం ఇంకొక జీవి ప్రాణం తీయడం సృష్టికి, సృష్టి ధర్మానికి విరుద్ధమని తెలుసుకోండి.

ఎవరికైతే ప్రతీ శరీరంలో పరమాత్మ కనిపిస్తాడో! వారికి ఎవరినైనా నొప్పించడము, ఎవరిపైనా అత్యాచారము చేయడము, బంధించడము లేదా ఏ జంతువునైనా హింసించడము వధించడము. అసాధ్యమైన పని. అలాంటి వారు అన్నిటిపై 'దయ' చూపిస్తారు.

అసలు ధ్యానం చెయ్యండి. మీరు కూడా అలాగే ప్రవర్తిస్తారు. ఎలాంటి ప్రశ్నలు వెయ్యరు. వాదనలు చెయ్యరు. దయాస్వరూపులవుతారు. ఎందుచేతనంటే **"ఏదైనా సృష్టి చేసిన వాడికి తెలుస్తుంది కానీ సృష్టింపబడిన వాడికి ఏమి తెలుస్తుంది?"**

క్రూర మృగాలను రక్షించి...
మమ్మల్ని భక్షించడం న్యాయమా?
జీవులన్నింటినీ ఆనందంగా జీవించనిద్దాం!



**మట్టితో దేవదేవతల నిర్జీవ ప్రతిమలను చేసి వాటిని పూజిస్తూ వాటి ఎదుట సజీవులను చంపి బలి ఇచ్చేవారికి అంత్యకాలమున అతి దుఃఖము, యాతనలు కలుగుతాయి. - కబీర్**

# గుడ్డు శాకాహారమా?



చాలా మంది కష్టాలలో వున్న వారు, కష్టాలు తొలగించమని; పిల్లలు లేనివారు పిల్లల్ని ప్రసాదించమని; తమ మీద 'దయ' చూపించమని దేవుని ప్రార్థిస్తూంటారు, వేడుకుంటారు, ఆర్తితో అర్థిస్తూ వుంటారు. వారు అలా 'దయ' చూపమని అర్థిస్తారు కానీ అంతకన్నా ఆలోచించరు.

ఇంకా చాలా మంది తమ పిల్లలు చిన్నపుడే చనిపోయినా, ఉన్న ఒక్కగానొక్క పిల్లవాడు ఎదిగిన తరువాత యాక్సిడెంట్లో గానీ, ఏ రకంగానైనా చనిపోయినా తమ కుటుంబంలోని పిల్లలు ఏ రకంగా దూరమైనా విపరీతమైన దుఃఖానికి లోనవుతారు. వారు భగవంతుడు తమకు అన్యాయం చేశాడని, ఆయనకు తమ మీద దయ లేదని వాపోతూంటారు. వారు అంతకన్నా ఆలోచించరు.

ఒక్కసారి ఆలోచించండి అలా తమపై వాడైన భగవంతుడు 'దయ' చూపించలేదని బాధపడుతున్నారు కానీ లోకంలో ఎంతమంది తమ క్రింది జీవుల మీద, జంతువుల మీద 'దయ' చూపిస్తున్నారు? ఆలోచించండి ఎంతమంది ఎన్ని జంతువులకు క్రూరంగా చంపి భక్షిస్తున్నారు? ఎంతమంది ఎన్ని కోడిగుడ్లను ఆహారంగా తీసుకుంటున్నారు? రోజూ తింటున్నారు? అసలు ఆలోచిస్తున్నారా?

గుడ్డు అంటే భగవంతుని సృష్టిలో కాబోయే ఒక పక్షి పిండం. అంటే కాబోయే పిల్లే గుడ్డు. మానవునికి పిల్లలు గర్భంలో పెరుగుతారు. పక్షులకు పిల్లలు గుడ్లలో పెరుగుతాయి. రెంటికీ అదే తేడా. అంటే గుడ్డును తినడమంటే గర్భాన్ని విచ్ఛిత్తి చెయ్యడమే. తయారయ్యే పిల్ల పిండదశలో హత్య చేయడమే.

అందుకే చూడండి ఏ పక్షులు అయినా సరే తమ గుడ్లను ఎంత జాగ్రత్తగా కాపాడుకుంటాయో! ఏ జంతువైనా గుడ్ల దగ్గరకు వస్తుంటే తమ ప్రాణాలను అర్పించి మరీ గుడ్లను కాపాడుకుంటాయి. కారణం అవి తమ కాబోయే పిల్లలు కనుక.

అంటే గుడ్లను తింటే పిల్లల్ని పిండ దశలోనే చంపినట్టు లెఖ్ఖ. మరి మనం మన క్రింది జీవులపై 'దయ' చూపగలిగితే మనం వాటి పిల్లలను అలా చంపగలమా?

ఆలోచించండి. **"మన క్రింది వాటిపై మనం దయ చూపనపుడు మనపై వాడు మనపై దయ చూపుతాడా?"** అసంభవం. అందుచేతే గర్భాలను విచ్ఛిత్తి చేసిన వాడు ఏదో జన్మలో గర్భం దాల్చకుండా, పిల్లల్ని చంపినవారు పిల్లలు లేకుండా బాధపడవలసి వస్తుంది.

ఈ సృష్టిలోని ఒక ధర్మ సూక్ష్మం ఏమిటంటే **"ఏది చేస్తే అదే అనుభవిస్తాం. అంటే ఎలాంటి కర్మ చేస్తే అలాంటి ఫలితం అనుభవిస్తాం"**. అంటే బిడ్డను

కోల్పోయిన ఆ కోడి తల్లి ఎంత క్షోభ అనుభవిస్తుందో! గుడ్లను తిని వాటి క్షోభకు కారణమైన వారు కూడా బిడ్డలు లేకుండా! బిడ్డలను కోల్పోయి ఏదో ఒక జన్మలో వారి జీవితంలో అంత క్షోభ అనుభవించవలసి వస్తుంది.

అందుచేత 'భూతదయ' కలిగి వుండండి. అమాయకపు నిస్సహాయ మూగ జీవులపై 'దయ' చూపండి. గుడ్డు ఆహారం కాదని తెలుసుకోండి.

కర్మసిద్ధాంతం గురించి మరి కొంతమంది మహాపురుషుల అభిప్రాయాలు కూడా చూద్దాం.

**1) తిరుమూలక్ :-**

ముందు చేసుకున్న కర్మల ఫలాన్ని తరువాత అనుభవించక తప్పదు.

**2) గురు సాహెబ్ :-**

"ప్రతీ జీవి తాను చేసిన కర్మల ఫలితాలననుభవించవలసి వస్తుందనేది పరమాత్మ దర్బారు యొక్క శాశ్వత చట్టము".

**3) తులసీ సాహెబ్ :-**

"బ్రహ్మాండం నశించిపోవచ్చును", కానీ ప్రతీ జీవి తాను చేసిన కర్మల ఫలితాలను అనుభవించవలసిందేనన్న నియమం మాత్రం మారదు".

**4) దరియా సాహెబ్ :-**

"జైసీ కర్ నీ వైసీ భర్ నీ అంటే ఎలాంటి కర్మలో అలాంటి ఫలితాలు" "ఖూన్ కే బద్‌లే ఖూన్" అంటే రక్తానికి రక్తం అన్న నియమమే పరమాత్మ దర్బారులో పనిచేస్తుంది.

**5) గురునానక్ :-**

"జీవుడు చేసిన కర్మలన్నీ అతడి వెంట వెడతాయి. తను విత్తిన కర్మల ఫలితాలను స్వయంగా అనుభవించవలసి వస్తుంది".

**6) గురు రవిదాస్ :-**

"జీవితమనే పొలంలో ఇష్టం వచ్చిన విత్తులు చల్లే (కర్మలు చేసే) స్వేచ్ఛ వుంది. కానీ ఫలితం విత్తులను (చేసిన కర్మలను) బట్టే వుంటుంది.

**7) కబీర్‌దాస్ :-**

ఏ చేయి కర్మలనాచరిస్తుందో ఆ చేయే ఫలితాలను అనుభవిస్తుంది.

**8) గౌతమ బుద్ధుడు :-**

మానవుడు పర్వత శిఖరాలలో గానీ, గుహలలో గానీ, సముద్రపు లోతులలో కానీ, లేదా ఆకాశంలో కానీ ఎక్కడికి వెళ్ళి దాక్కున్నా తాను చేసిన కర్మల ఫలితాల నుండి తప్పించుకోలేడు. ఆ సృష్టి కర్త గుమ్మంలో పూర్తి న్యాయముంది.

**9) రామకృష్ణ పరమహంస :-**

"కారం తింటే నోరు మండుతుంది. తీపి తింటే నోరు మధురమవుతుంది".

ఈ విధంగా ఎంతో మంది మహాత్ములు కర్మ సిద్ధాంతం గురించి చెప్పడం జరిగింది.

అందుచేత భగవంతుని సృష్టిలో వున్న మనం భగవంతుని సృష్టియొక్క







ధర్మ సూక్ష్మాల ప్రకారం  జీవించాలి అంటే కర్మలు చెయ్యాలి. ముఖ్యంగా మన వల్ల సృష్టిలోని ఏ జీవికి, ప్రాణికి మనవల్ల హాని, నష్టం, కష్టం కలగకుండా చూసుకోవాలి. లేకపోతే దాని ఫలితం అనుభవించవలసి వస్తుంది. తరువాత బాధపడినా ప్రయోజనం లేదు.

ఇలా మనం చెబితే కొంతమంది ఏమంటారంటే మేము తినే గుడ్లు పిల్లలుగా మారవు. పిల్లలు అయ్యే గుడ్లను మేము తినము. పిల్లలు అవ్వవు కాబట్టి అవి శాకాహారం క్రిందనే వస్తాయట కదా? అందుకే తింటున్నాము అని అంటూ వుంటారు. అలా తాము చేసే పని సమర్థించుకుంటూ వుంటారు.  కాని అంతకన్నా ఆలోచించరు.

కొంచెం ఆలోచించండి మానవుల విషయమే తీసుకుందాం. స్త్రీలలో నియమిత కాలంలో అంటే ప్రతీనెలా ఒక అండం విడుదల అవుతుంది. ఆ సమయంలో పురుష సంపర్కం జరుగుతే గర్భం దాలుస్తారు. అండం బిడ్డగా మారుతుంది. పురుష సంపర్కం జరగకపోతే అది విసర్జించబడుతుంది. దానినే 'బహిష్టు' అంటాం. బహిష్టు ఎంత దోషమంటే బహిష్టు అయిన వారిని 3 రోజులు దూరంగా వుంచుతారు. అంటరానివారిగా చూస్తారు.

అలాగే కోడిలో కూడా నియమిత కాలంలో అంటే 24 గంటలలో ఒక అండం తయారవుతుంది. అపుడే కనుక పుంజు సంపర్కం జరిగితే ఆ అండం అంటే ఆ గుడ్డు పిల్లగా మారుతుంది. పుంజు సంపర్కం జరుగకపోతే గుడ్డు పిల్లగా మారదు. పిల్లగా మారే గుడ్డుకి మారని గుడ్డుకి ఇదే తేడా. అంతేతప్ప పిల్లగా మారే గుడ్డులోని పదార్థానికి, మారని గుడ్డులోని పదార్థానికి ఇంక ఏ తేడా లేదు. అంటే ఏ గుడ్డులో వున్న పదార్థమైనా ఒకటే. రెండూ మాంసాహారమే.

అంటే ఒక విధంగా పిల్ల కాని గుడ్డు స్త్రీల బహిష్టుతో సమానం. మరి బహిష్టు దోషమని చెప్పుకుంటాం. అలాంటి గుడ్డును ఎలా తినగలం? అందుచేత ఆలోచించండి ఏ గుడ్డు అయినా పక్షి రక్తమాంసాలతో  తయారయినదే. గుడ్డు

చెట్లకు కాసింది కాదు. అందుచేత పిల్లయినా పిల్ల కాకపోయినా గుడ్డు అన్నది శాకాహారం కాదని తెలుసుకోండి.

అంతేకాదు కోడి అసహ్యకరమైన పదార్థాలు అనగా ఉమ్మి, చీమిడి, మలము వాంతి లాంటి పదార్థాలే కాకుండా! పురుగు, పుట్ర, కుళ్ళిన పదార్థాలను తింటూ గుడ్డు తయారుచేస్తుంది. అలా తయారయిన పదార్థాన్ని మనం ఎలా తినగలం?

అంతేకాదు ఈ సృష్టి, సృష్టిలో వున్న 84 లక్షల జీవరాసులతో ఈ సృష్టి ఎన్నో కోట్ల సంవత్సరాల నుంచి అలా కొనసాగుతూనే వుంది. దానికి ముఖ్య కారణం ఈ సృష్టిలో భగవంతుడు ఏర్పాటు చేసిన పునరుత్పత్తే కారణం. ఈ సృష్టి క్రమం కొనసాగించడానికి ఆయన ఈ ఏర్పాటు చేసాడు. అలా జీవుల పునరుత్పత్తి అన్నది భగవంతుడు చేసిన ఏర్పాటు. దానికి ఎవరు భంగం కలిగించినా వారు భగవంతుని నిర్ణయాన్ని ధిక్కరించిన వారవుతారు. వారు భగవంతుని నియమాల ప్రకారం శిక్షార్హులవుతారు. ఈ ప్రకృతితో శిక్షింపబడతారు. కష్టాల పాలవుతారు. అందుచేత **"భగవంతుని సృష్టిలో వున్న మనం భగవంతుని నిర్ణయాలను గౌరవించాలి".** కారణమేమిటంటే ఈ సృష్టిలో సమస్త జీవులు 4 రకాలుగా పునరుత్పత్తి చెందుతున్నాయి.

1) ఉద్భిజాలు, 2) శ్వేదజాలు, 3) అండజాలు, 4) జరాయుజాలు.

1) ఉద్భిజాలు :- లోపల నుంచి బయటకు చొచ్చుకు వచ్చేవి. అంటే వృక్ష జాతి.

2) శ్వేదజాలు :- చెమట, చెమ్మ, ఉమ్మెదము నుంచి ఉద్భవించేవి. పేలు, నల్లులు, నాచు, కొన్ని రకాల ఫంగస్ లాంటివి.

3) అండజాలు:- గుడ్డు నుంచి పుట్టేవి. పక్షిజాతి, సర్పజాతి, తాబేలు, మొసలి లాంటివి.

4) జరాయుజాలు :- పూర్తిగా వాటి ఆకారంతో జన్మించేవి. మానవులు, జంతువులు లాంటివి.

ఈ నాలుగు రకాలుగా సృష్టి క్రమం కొనసాగుతుంది. అలా సృష్టిలో జరిగే క్రమాన్ని, గుడ్లను తినడం ద్వారా మానవులు అవరోధం కలిగిస్తున్నారు. సృష్టికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. అందుచేత దాని ఫలితం మానవుడు అనుభవించవలసివస్తుంది. అందుచేత గుడ్లు అన్నవి మానవుని ఆహారం కాదు. శాకాహారం, అసలే కాదు. అందుచేత క్రూరంగా పక్షిజాతి సంతతిని భక్షించడం కాదు, వాటిపై దయ చూపాలి. వాటిని కూడా జీవించనివ్వాలి. **"ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించడమంటే పరమాత్మ ఆజ్ఞను ధిక్కరించడమే".** సృష్టి పరిణామ క్రమంలో వాటి పాత్రను కూడా పోషించనివ్వాలి. ఏ కార్యం నిమిత్తమై అవి భగవంతునిచే సృష్టింపబడ్డాయో ఆ కార్యాన్ని పూర్తిగా నిర్వర్తించనివ్వాలి. వాటి పుత్ర ప్రేమకు విఘాతం కలిగించకూడదు. అలా 'దయ' చూపినపుడే మానవుడు కూడా పైవాడి 'దయ' పొందగలుగుతాడు.

**అంత్యకాలంలో పశ్చాత్తాప పడవలసిన కర్మలు ఆరంభమే చేయవద్దు**

# పప్పుకూడు - పాపపు కూడు

పప్పుకూడు అని శాకాహారులను మాంసాహారులు ఎగతాళి చేస్తారు. కానీ ఆలోచిస్తే పాపపు కూడైన మాంసాహారం కంటే శాకాహారమైన పప్పు కూడే మంచిది.

శాకాహారం మానవుల కూడు. మాంసాహారం రాక్షసుల కూడు. ఆలోచిస్తే శాకాహారమే మానవులకు సహజమైన కూడు. ప్రకృతి నిర్దేశించిన కూడు.

1) పప్పుకూడు ఆరోగ్యాన్ని ఇస్తే - పాపపు కూడు రోగాల్ని కలిగిస్తుంది.
2) పప్పుకూడు మనస్సుకు శాంతిని ఇస్తే - పాపపుకూడు అశాంతిని కలుగచేస్తుంది.
3) పప్పుకూడు బుద్ధి వికసింపచేస్తే - పాపపుకూడు బుద్ధి మందగింపచేస్తుంది.
4) పప్పుకూడు జ్ఞానాన్ని పెంచుతే - పాపపు కూడు అజ్ఞానాన్ని కలిగిస్తుంది.
5) పప్పుకూడు ఆత్మశక్తిని వృద్ధి చేస్తే - పాపపు కూడు ఆత్మ శక్తిని క్షీణింపచేస్తుంది.
6) పప్పు కూడు సాత్వికగుణం కలుగచేస్తే - పాపపు కూడు తమో గుణం, రజోగుణం కలుగచేస్తుంది.
7) పప్పు కూడు అహింస - పాపపు కూడు హింస
8) పప్పుకూడు పంచభూతాలతో తయారయితే - పాపపుకూడు రక్తమాంసాలతో తయారవుతుంది.
9) పప్పుకూడు అమృతాహారం - పాపపు కూడు మృతాహారం
10) పప్పు కూడు శాకాహారం - పాపపు కూడు శవాహారం.
11) పప్పుకూడు ప్రకృతి సహజ సిద్ధం - పాపపు కూడు ప్రకృతి విరుద్ధం
12) పప్పు కూడు జీవశక్తి వున్నది - పాపపు కూడు జీవశక్తి లేనిది.

పప్పుకూడైన శాకాహారానికి, పాపపు కూడైన మాంసాహారానికి తేడా చూద్దాం. శాకాహారమైన కూరగాయలు కుళ్ళి పాడవటానికి 10 నుండి 15 రోజులు పడుతుంది. కానీ మాంసం నిమిషాలలోనే కుళ్ళి భయంకరమైన వాసన వస్తుంది. పురుగులు పడుతుంది. భరించలేని కంపు కొడుతుంది.

కుళ్ళిన కూరగాయలు రోడ్డు ప్రక్కన పోసినా ఎవరూ ఇబ్బంది పడరు. ఎవరికీ హానికరం కాదు. కానీ చనిపోయిన జంతువులను కానీ, వాటి మాంసాన్ని కానీ రోడ్డు ప్రక్కన వేస్తే ఆ ప్రక్కగా వెళ్ళేవారు వాసన భరించలేరు. చూడటానికి కూడా అసహ్యకరంగా వుంటాయి. అసలు ఆ ప్రక్కకు ఎవరూ వెళ్ళలేరు కూడా.

శాకాహారమైన పళ్ళను ఒక బుట్టలో వేసి డైనింగ్ టేబుల్ మీద కొన్ని రోజులు పాటు ఉంచుకుంటాం. కానీ చచ్చిన చేపలను, మాంసాన్ని అలా ఉంచగలమా?

కూరగాయలను ఒక గదిలో, మాంసాన్ని, చచ్చిన వాటిని మరొక గదిలో వుంచితే రెండు రోజులు పోయాక ఏ గదిలోకి వెళ్ళగలం? కూరగాయలు వున్న గదిలోకే వెళ్ళగలం. కారణం మాంసం వుంచిన గది భరించలేని వాసన వస్తుంది. పురుగులు పట్టి వుంటుంది. ఆ పురుగులు గది అంతా వ్యాపిస్తాయి. అసలు ఆ గది తలుపులే తీయలేం. అలాంటి కుళ్ళిపోయే ఆహారం ఎలా తినగలం? ఆలోచించండి.





ఏ మానవుడు పళ్ళు, కాయ గూరలు లేక కాయ ధాన్యాలు వంటివి చూసినా బాధపడడు. అసహ్యించు కోడు. కానీ చాలా మంది వధించిన జంతువుల శరీర భాగాల్ని మాంసం దుకాణంలో వ్రేలాడదీసి వుండటం చూడగానే అసహ్యించుకోవడమే కాదు బాధపడతాడు కూడా.

శాకాహార కాయధాన్యాలు వున్న కిరాణా దుకాణంలో అవి ఎన్ని రోజులు వున్నా చెడిపోవు. వాసన రావు. ఆ దుకాణంలో వున్న వారికి రోగాలు రావు. కానీ మాంసం దుకాణంలో వున్నవాడు. జంతువుల మాంసాన్ని ఒక్కరోజు మించి వుంచితే ఆ యజమానే ఆ దుకాణంలో వుండలేడు. అంటే మాంసాహారం కుళ్ళిపోయి, పురుగులు పట్టి, వాసన వచ్చే ఆహారమని తెలుస్తుంది కదా?

అంతేకాదు గదుల్లోను, హాలులో, ఇంట్లో ఎక్కడైనా కూరగాయలు, రకరకాల పళ్ళు వున్న బొమ్మలను అలంకారంగా గోడలకు తగిలించుకుంటాం. కానీ మాంసాన్ని, చచ్చిన జంతువుల బొమ్మలను ఎవరైనా అలంకరించుకుంటారా?

అంతేకాదు వివాహాలలో, శుభకార్యాలలో, మామిడాకుల తోరణాలు కడతారు. అరటి గెలలతో మొక్కలను అలంకరిస్తారు. పూలు, పూల దండలు అలంకరిస్తారు. కానీ చచ్చిన జంతువుల భాగాలు అంటే కొమ్ములు, ఎముకలు, చేపలు, మాంసం లాంటివి అలంకరించరు కదా? అందుచేత ఆలోచించండి. మానవులకు ఏది శ్రేష్ఠమైన ఆహారమో!

అందుచేత **"పప్పుకూడు తినేవాడు కాదు పాపపు కూడు తినేవాడే సిగ్గుపడాలి".** ఆలోచించండి అన్ని రకాలుగా లాభం కలిగించే శాకాహారమైన పప్పుకూడు తినండి. పాపపు కూడైన మాంసాహారం మానండి.





# ఆహారమే ప్రధానమా?

**"Man does not live by bread alone"** "రొట్టెతోనే మానవుడు జీవించలేడు" - జీసస్

అంటే జీవితానికి ఆహారమే ప్రధానం కాదు అని జీసస్ సందేశం. కాని మానవులు ఆహారానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నారు. అంటే తినటానికే జీవిస్తున్నారు. తినకపోతే జీవితం ఎందుకని ప్రశ్నిస్తున్నారు. తింటేనే అనుభవించినట్టు, అనుభవించాలంటే తినాల్సిందే... ఇదే మానవుల అభిప్రాయం. అందుకే ఎక్కువ సమయం సంపాదనకు వినియోగిస్తున్నారు. కారణం బాగా సంపాదిస్తే బాగా తినవచ్చనే అభిప్రాయం. అంతేకాదు తినడం కోసం రకరకాల వంటకాలు, పదార్థాలు అన్ని రుచులతో తయారుచేసుకుంటున్నారు. రకరకాల కొత్తవంటకాలు కనిపెడుతున్నారు. పాకశాస్త్రంలో రీసెర్చిలు చేస్తున్నారు.

ఖాళీగా వున్నపుడు వంటకు కావలసిన సరకులు సమకూర్చు కుంటున్నారు. తరువాత రకరకాల పదార్థాలు తయారు చేసుకుంటున్నాడు. కనీసం రోజులో నాలుగయిదుసార్లయినా తింటున్నారు. అసలు తిండితోటే రోజు ప్రారంభిస్తున్నారు. కొంతమంది కాఫీ తాగి మరీ కళ్ళు విప్పుతారు. అంటే తిండికి అంత ప్రాముఖ్యం ఇస్తున్నారు.

ఇంకా కొంతమంది తిండి కోసం హింస కూడా చేస్తున్నారు. అమాయకపు మూగ జీవులను చంపుతున్నారు. మాంసభక్షణ చేస్తున్నారు. మాంసం కోసం జంతువులను, పక్షులను చంపుతున్నారు. చంపడం కోసం ఘోరమైన పద్ధతులు అవలంబిస్తున్నారు. అలా పాపాలు చేస్తున్నారు. చివరకు ఆ పాప ఫలితంగా వచ్చే రోగాలు, బాధలు భరించలేక తల్లడిల్లిపోతున్నారు. రక్షకుడా రక్షించు... రక్షించు... అంటూ గగ్గోలు పెడుతున్నారు. ఆర్తనాదాలు చేస్తున్నారు, రోదనలతో ప్రార్థనలు చేస్తున్నారు. ఇదంతా తిండికి ప్రాముఖ్యం ఇవ్వడం వల్లే జరుగుతుంది తప్ప వేరొకరని అర్థం చేసుకోలేకపోతున్నారు. దీనిని బట్టి మానవునికి తిండి ఒక్కటే సరిపోదు అని అర్థమవుతుంది.

జీసస్ సందేశం ప్రకారం మానవుడు ఆనందంగా జీవించాలంటే రొట్టె

(తిండి) ఒక్కటే సరిపోదు. జీవితంలో మానవుడు రొట్టె (తిండి)తో పాటు ఇంకా చాలా సమకూర్చుకోవాలి. ఇంకా చాలా ఆలోచించాలి.

కూడుతో పాటు గుడ్డ (బట్ట) వుండాలి. గూడు (ఇల్లు) వుండాలి. ఒక తోడు (భర్తకు భార్య, భార్యకు భర్త) వుండాలి. ఇవన్నీ వున్నా ఆనందంగా వుండాలంటే ఆరోగ్యం వుండాలి, శాంతి వుండాలి. సంసారంలో సుఖ శాంతులు వుండాలి. మరి ఇవన్నీ కావాంటే మానవుడు చాలా ఆలోచించాలి. జీవితంలో ధర్మాన్ని ఆచరించాలి. పొరుగువారిని ప్రేమించాలి అంటే పొరుగున ఉన్న మానవులనే కాదు, పొరుగున వున్న జంతువులను అంటే కోడి, మేక, గొర్రె, చేప లాంటి వాటిని కూడా తనను తాను ప్రేమించుకున్నట్టు ప్రేమించాలి. బలహీనులమీద, అమాయకుల మీద, మూగ జీవాలమీద జాలి, దయ, కరుణ చూపించాలి. వాటి బాధ తన బాధలా భావించాలి.

అన్నీ ఆయన బిడ్డలే. అందుచేత ఆయనకు మానవులతో సహా అంతా సమానమేనని తెలుసుకోవాలి. ఆయనకు అంతా ఒక్కటేనని తెలుసుకోవాలి. ఆయన మానవులకే కాదు అందరికీ అంటే అన్ని జంతువులకు ఆయన కాపరి అంటే రక్షకుడు. అందుచేత వేటిని హింసించకూడదు. తక్కువగా చూడకూడదు, అన్నిటినీ ప్రేమించాలి, అన్ని ప్రాణుల మీద 'దయ' చూపించాలి.

అలా జీవిస్తేనే జీవితంలో ఆనందం. అంతేకాని రకరకాల పదార్థాలు తిన్నంత మాత్రాన, మాంసాహారం లొట్టలేసుకుని ఆరగించినంత మాత్రాన జీవితంలో ఆనందం లభించదు. భరించలేని, అంతులేని వింత రోగాలతో, జబ్బులతో వారి జీవితం నరక ప్రాయమవుతుంది. అలా నరకాన్ని చవిచూసే జీవితం జీవితమే కాదు. అది జీవించడం కాదు. అందుకే జీసస్ 'రొట్టెతోనే మానవుడు జీవించలేడు' అన్న అద్భుతమైన సందేశం మానవులకు ఇచ్చాడు. అందుచేత **"తినడం కోసం జీవించకండి; జీవించడానికి తినండి".**



**మాంసభక్షణ చేసేవారు ఎవ్వరూ లేకపోతే జంతువులను చంపేవారు కూడా వుండరు. - తిరువళ్ళువర్**



# దుష్టులు - శిష్టులు



లోకంలో రెండు రకాల వారు వున్నారు. వారు దుష్టులు, శిష్టులు. దుష్టులు అంటే చెడ్డవారు, శిష్టులు అంటే మంచివారు.

లోకంలో దేవుళ్ళను అందరూ రకరకాలుగా ఆరాధిస్తూ వుంటారు. కొందరు పూజిస్తారు. కొందరు ప్రార్థిస్తారు. కొందరు నమాజు చేస్తారు. కొందరు భజన చేస్తారు. దీనికి కారణం దేవుడు తమ కష్టాలనుంచి, బాధలనుంచి, సమస్యలనుంచి, రోగాలనుంచి తమను రక్షిస్తాడని భావిస్తున్నారు. నమ్ముతున్నారు. కానీ సృష్టిలో రక్షించబడే వారే కాదు శిక్షింపబడేవారు కూడా వున్నారని తెలుసుకోలేక పోతున్నారు. కారణం దేవుడు రక్షించేది శిష్టులనే కానీ దుష్టులను కాదు. దుష్టులను కచ్చితంగా శిక్షించే తీరుతాడు.

దేవుడు "దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడనే" విషయం మనం పురాణాలను చూస్తే తెలుస్తుంది. భగవద్గీతలో ఈ క్రింది శ్లోకం చూద్దాం.

**శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే! (భ.గీ.4-8)**

తా:- సాధు సజ్జనులను సంరక్షించడానికి దుష్టులను వినాశనము చేయటానికి, ధర్మాన్ని స్థాపించటానికి నేను ప్రతి యుగమును జన్మించుచున్నాను.

ఎందుచేతనంటే శిష్టులు కోరకపోయినా రక్షింపబడతారు. కాని దుష్టులు పూజించినా, ప్రార్థించినా, నమాజు చేసినా, భజన చేసినా కూడా కచ్చితంగా శిక్షింపబడతారు. అందుకే పూజలు, ప్రార్థనలు చేసేవారు కూడా దుఃఖం పొందుతున్నారు. అంటే శిక్షలు అనుభవిస్తున్నారని అర్థం అవుతుంది. మానవుడు అనుభవించే కష్టాలే వారికి విధింపబడిన శిక్షలని తెలుసుకోవాలి. అందుచేత శిక్షలు పడకూడదనుకుంటే దుష్టత్వాన్ని వదలాలి, అలానే రక్షింపబడాలంటే శిష్టత్వాన్ని చేపట్టాలి. ఇంతకు తప్ప వేరొక మార్గం లేదు. మరి ఎవరు దుష్టులు? ఎవరు శిష్టులు? ఎవరికైతే 'దయ, కరుణ' వుండదో! హింస చేస్తారో! వారిని దుష్టులు అంటారు. ఈ హింస చేసేవారు రెండు రకాలు. 1.శారీరక హింస చేసేవారు. వారిని రాక్షసులు అంటారు. 2.మానసిక హింస చేసేవారు. వారిని దుష్టులు అంటారు.

వీరిద్దరూ కూడా దేవునిచే శిక్షింపబడతారు, వీరు ఎన్ని ఆరాధనలు చేసినా రక్షింపబడరు.

శారీరక హింస చేసేవారు ఎవరు అంటే ఇతరులను, ఇతర జీవులను, ఇతర ప్రాణులను హింసించి వాటి హింసతో ఆనందం పొందేవారు. అంటే జీవహింస చేసేవారు, మాంసం తినేవారు, జీవులపై 'దయ' చూపనివారు. మాంసాహారం అంటే ఇష్టపడేవారు. ఈ జీవహింస అన్నది ఘోరమైన పాపం.

ఇటువంటి రాక్షసులు దేవునిచే శిక్షింపబడతారని, పురాణాలన్ని మనకు తెలియచేస్తున్నాయి.

అలాగే మానసిక హింస చేసే దుష్టులు కూడా శిక్షింపబడతారు. వీరు ఇతరులను దూషిస్తారు, మోసగిస్తారు, వారి సొత్తును అపహరిస్తారు. అవమానిస్తారు, కష్టాలకు గురిచేస్తారు.

దేవుడు రాక్షసులను శిక్షిస్తాడని 'రామాయణం' ద్వారా, అలాగే దేవుడు దుష్టులను శిక్షిస్తాడని 'భారతం' ద్వారా మనం తెలుసుకోవచ్చు. ఎందుచేతనంటే హింస అన్నది సృష్టి ధర్మానికి అంటే భగవంతుని ధర్మానికి విరుద్ధం. అహింసే సృష్టి ధర్మానికి అనుగుణమైనది. అందుకే "అహింసా పరమో ధర్మః" అని అన్నారు. అంటే "హింస అధర్మం' అని అర్థం.

అధర్మం నశిస్తుంది. అధర్మం రక్షింపబడదు. పైగా శిక్షింపబడుతుంది. అందుచేత అధర్మాన్ని వదలండి అంటే హింసను వదలండి. రాక్షసత్వాన్ని వదలండి. దుష్టులులా ప్రవర్తించకండి.

"ధర్మో రక్షతి రక్షితః" అన్నారు కదా! అంటే 'ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది' అంటే ధర్మమే మనల్ని కాపాడగలిగేది. మరి హింసను వదలాలంటే ఒక్కటే మార్గం. అదే ధ్యానం. ధ్యానం చేస్తే ఎలాంటివారైనా హింసను వదలగలరు. దుష్టత్వాన్ని వదలగలరు. "దయ, కరుణ" అన్నవి వారి గుణాలవుతాయి. అలాంటి వారు శిక్షింపబడరు, వారికి కష్టాలు రావు, రోగాలు రావు, జీవితంలో ఆనందంగా జీవిస్తారు.

అలాగే శిష్టులలో (1) మహాత్ములు, (2) దేవతలు అని రెండు రకాల వాళ్ళు వున్నారు. వీరు ఎవరికి హింస చేయరు సరికదా అందరికి మంచి చేస్తారు. అంటే ఆనందం కలిగిస్తారు. వీరిద్దరూ రక్షింపబడతారు. కాని దేవతలే దేవునికి ఇష్టులు. దేవుని చేరగలరు కూడ. మహాత్ములు సేవచేస్తారు, మంచి చేస్తారు కాని కొన్ని వర్గాలకు మాత్రమే చేస్తారు. తమ కుటుంబానికో కులానికో, మతానికో, ప్రాంతానికో, దేశానికో మాత్రమే సేవ చేస్తారు. ఇది పరిధులతో కూడిన సేవ.

కాని దేవతలు అంతా తామే అన్న భావంతో అంటే మానవులే కాదు సమస్త జంతువులు అందరూ ఒక్కటే అన్న భావంతో, అంతా భగవంతుని రూపాలే అని భావిస్తూ అందరికీ సేవచేస్తారు. అందరికీ ఆనందం కలిగించే ప్రయత్నం చేస్తారు. అవధులు లేని సేవ చేస్తారు. అందరిలో దేవుని చూస్తారు. వీరు ఎక్కువ ధ్యానం చేస్తారు. అందుకే దేవునికి ఇష్టులయ్యారు. భగవంతుడు దేవతల పక్షపాతి అని కూడా అనిపించుకున్నారు.

అందుకే ఏ పురాణంలో చూసినా దేవుళ్ళు రాక్షసులను సంహరించడం చూస్తున్నాం. అలాగే దేవతలను రక్షించడం చూస్తున్నాం.

అందుచేత దుష్టత్వాన్ని, రాక్షసత్వాన్ని వీడండి. జీవహింస చేయకండి. జంతువులపై 'దయ' చూపండి. మాంసభక్షణ మానండి. శాకాహారులు కండి. ధ్యానం చెయ్యండి. శిష్టులుగా జీవించండి. భగవంతుని రక్షణ పొందండి. ఆనందంగా జీవించండి.



# అమృతం ఎవరికి దక్కింది?

దేవతలు అంతా శ్వాసాహారులు అంటే ధ్యానం చేసేవారు. రాక్షసులు అంతా మాంసాహారులు. అంటే జీవహింస చేసేవారు.

ఇద్దరూ అమృతం కోసం పోటీ పడ్డారు. పాలసముద్రాన్ని మథించారు. కారణం అమరులవ్వడానికి. పాలసముద్రాన్ని మథించగా, మథించగా మొదట హాలాహలం, కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం, లక్ష్మీదేవి ఇలా ఎన్నో పుట్టాయి. చివరకు అమృతం కూడా పుట్టింది. అలా అమృతం సాధించడంకోసం దేవతలు, రాక్షసులు ఇద్దరూ కష్టపడ్డారు. కానీ భగవంతుడు, మోహినీ రూపంలో దేవతలకే అమృతాన్ని పంచాడు. రాక్షసులకు దక్కనివ్వలేదు.

దీనిని బట్టి భగవంతుని అనుగ్రహం దేవతలకే వుంది కానీ, ఎంత కష్టపడినా రాక్షసులకు కలగలేదు. అంతేకాదు భగవంతుడు దేవతల పక్షపాతి అని కూడా అంటారు. కారణం రాక్షసులు జీవహింసాపరులు, మాంసభక్షకులు, లోకాన్ని హింసించేవారు. కానీ దేవతలు అహింసాపరులు. ధ్యాన నిష్ఠ, అంటే శ్వాసనే ఆహారంగా తీసుకునేవారు. లోకానికి ఉపకారం చేసేవారు అందుచేత వారు భగవంతుని అనుగ్రహం పొందగలిగారు. అమృతంతో అమరత్వం పొందారు. కానీ మాంసభక్షకులైన రాక్షసులు కష్టపడినా అమృతం పొందలేక దుఃఖకరమైన జనన మరణ చక్రంలో చిక్కుకున్నారు.

అంటే మాంస భక్షణ చేసే వారు భగవంతుని అనుగ్రహం పొందలేరు సరికదా. జనన మరణాలనే దుఃఖకరమైన చక్రంలో చిక్కుకుంటారని భగవద్గీత ద్వారా మనం తెలుసుకోవచ్చు.

**శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్।**
**క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ (భ.గీ.16-19)**

తా॥ "సర్వ జీవుల యందు ఆత్మ స్వరూపుడి నైవున్న నన్ను హింసించు క్రూరులైన దుష్టులను, జనన, మరణములతో ఉండు దుఃఖకరమైన, ఘోర సంసార మందు, మాటిమాటికీ పడవేసి వారిని బహు దుఃఖకరమైన అసుర (రాక్షస) యోనులందు పుట్టించెదను"

అందుచేత మృతాహారమైన మాంసాహారం వదిలేద్దాం. అమృతాహారమైన ఫలాలు శాకాహారం తీసుకుందాం. ధ్యానం చేద్దాం. భగవంతుని అనుగ్రహానికి పాత్రులవుదాం. అమరులవుదాం. అందుకే **"అమృతానికి మించిన ఆహారం లేదు. ధ్యానానికి మించిన సాధన లేదు"** అంటారు.

# తల్లిదండ్రులను గౌరవించాలి - హింసించకూడదు

**బ్రహ్మర్షి పత్రీజీ ఒక సందర్భంగా ఇచ్చిన అద్భుత సందేశం:-**

తల్లిదండ్రులను గౌరవించాలి కానీ హింసించకూడదు అని పెద్దలు చెపుతూ వుంటారు. అలా పిల్లలకు బోధిస్తారు. ఉపన్యాసాలు ఇస్తూ వుంటారు. కానీ అంతకన్నా ఆలోచించరు.

సృష్టిలో మానవులే కాదు ఎవరు జన్మ ఇచ్చినా తల్లే. అందుచేత ఏ తల్లైనా గౌరవించ తగ్గదే, ప్రేమించతగ్గదే. సృష్టి లెక్కలో ప్రతీ తల్లి గౌరవించ తగ్గదే.

మానవులు తల్లిదండ్రులను గౌరవించమంటారు. కానీ చేప తల్లిని, కోడి తల్లిని, మేక తల్లిని హింసిస్తూ వుంటారు. చంపుతూ వుంటారు. భక్షిస్తూ వుంటారు. మరి తల్లిదండ్రులను గౌరవించాలని చెప్పేవారే జంతువుల తల్లులను చంపి తమ పిల్లలకు పెడుతూ వుంటారు. తిరిగి మేము తల్లిదండ్రులం మమ్మల్ని గౌరవించండి, అది పిల్లల బాధ్యత అని చెపుతూ వుంటారు. మరి వీరికి బాధ్యత గురించి ఎంత వరకు తెలుసు? సృష్టిలోని ఇతర తల్లిదండ్రులను హింసించే వీరేమి తల్లిదండ్రులు? వీరు పిల్లలకు ఏమి చెప్పగలరు?

వీరు తమని గౌరవించమంటారు కానీ వారు మాత్రం సృష్టిలోని కోడిపిల్ల తల్లిని, మేకపిల్ల తల్లిని, చేపపిల్ల తల్లిని గౌరవించరు. వారు తమ పిల్లల నుంచి ప్రేమ ఆశిస్తారు. కానీ వారు వేటిని ప్రేమించరు. ఇదే అజ్ఞానం, మూర్ఖత్వం. ఇలాంటి వారు తప్పనిసరిగా భవిష్యత్తులో నరకం అనుభవిస్తారు.

ధ్యానం చేస్తే అన్నీ ఆలోచించగలుగుతారు. అర్థం చేసుకుంటారు. సృష్టిలో అన్నిటిని గౌరవిస్తారు. "అన్నిటిని ఆనందంగా జీవించనిస్తారు. తాము ఆనందంగా జీవిస్తారు". ఇదే సృష్టి ధర్మం.

ఇదే భగవాన్ వర్ధమాన మహావీరుని సందేశం. "జీవించు – జీవించనివ్వు".



# భూతదయ చూపండి!
# దేవునికి ఇష్టులు కండి! దేవుని ప్రేమకు పాత్రులు కండి!

అందరూ భగవంతునికి ఇష్టులవ్వాలని, ఆయన ప్రేమను పొందాలని, ఆయన ప్రేమకు పాత్రులు కావాలని భావిస్తూంటారు. అలా కాగలిగితే తాము ధన్యులమే అని భావిస్తారు. అంతకన్నా కావలసింది ఇంక ఏమీ వుండదనే భావిస్తారు.

మరి భగవంతుని ప్రేమను పొందాలంటే ఏమి చెయ్యాలో ఈ క్రింది శ్లోకం ద్వారా శ్రీ కృష్ణ భగవానుడే చెప్పడం జరిగింది.

**శ్లో॥ సంనియ మ్యేన్ద్రియ గ్రామం, సర్వత్ర సమ బుద్ధయః**
**తేప్రాప్నువన్తి మామేవ సర్వభూత హితేరతాః (12-4)**

తా:- ఎవరు ఇంద్రియములన్నిటినీ తమ స్వాధీనంలో వుంచుకుంటారో, అందరి పట్ల సమ భావం కలిగి వుంటారో, సమస్త ప్రాణులకు హితము చేయుట యందు ఆసక్తి చూపిస్తారో వారు నన్ను పొందుతారు.

పై శ్లోకంలో భగవానుడు ముఖ్యంగా చెప్పింది అందరి పట్ల, అన్ని జీవుల పట్ల సమభావం కలిగి వుండాలనే. కారణం అందరిలో వున్నది ఆయనే కనుక. లోకంలో తక్కువ - ఎక్కువ; హీనమైనది - అధికమైనది అన్నవి లేనే లేవు. అందుచేత అందరి పట్ల, అన్నిటి పట్ల సమభావం కలిగి వుండాలన్నారు.

ఈ విషయచమే తాళ్ళపాక అన్నమాచార్యుల వారు "బ్రహ్మమొక్కటే ... పరబ్రహ్మమొక్కటే... అని పాడుతూ హీనాధికములెందూ లేవు.. అందరికీ శ్రీహరే అంతరాత్మ!" అని స్పష్టంగా చెప్పారు.

శ్రీ కృష్ణ భగవానుడు ఇంకా సమస్త ప్రాణులకు హితం చేయడానికి, అంటే మంచి చెయ్యడానికి ఆసక్తి చూపించాలన్నారు. అంటే వాటిని భక్షించటం కాదు - రక్షించటంలో ఆసక్తి చూపించాలన్నారు. హింసించడం కాదు - దయ చూపించాలన్నారు.

అలా సమస్త భూతాల (జీవుల) పట్ల ఎవరైతే మంచి చెయ్యడానికి ప్రయత్నిస్తారో అంటే వాటిని హింసించకుండా, వాటి మీద హింస జరగకుండా చూస్తారో! అంటే మాంసభక్షణ మానడమే కాదు! అందరి చేత మాంసభక్షణ మాన్పించే ప్రయత్నం చేస్తారో! వారు భగవంతుని పొందవచ్చు అని పై శ్లోకం ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు.

ఎందుచేతనంటే ఎవరి చేతనైనా ఒక్కరిచేత మనం మాంస భక్షణ

మాన్పించగలిగితే ఇంచుమించు వారి మొత్తం జీవితంలో ఎన్నో వందల కోళ్ళు బ్రతుకుతాయి, ఎన్నో మేకలు, ఎన్నో చేపలు బ్రతుకుతాయి. ఆనందంగా జీవిస్తాయి. అలా ఒక్కరిచేత మాంసం మాన్పించినా... ఎన్నో వందల ప్రాణులకు హితం చేసిన వారమవుతాం. మంచి చేసిన వారమవుతాం. ఆనందం కలిగించిన వారమవుతాం. స్వేచ్ఛగా జీవించగలిగే అవకాశం కల్పించినవారమవుతాం.

అలా అన్ని జీవులు దేవుని రూపాలే కనుక అంత మంది దేవుళ్ళకు ఆనందం కలిగించిన వారమవుతాం. తద్వారా దేవుని దృష్టిలో మనం చాలా గొప్పవారం కాగలుగుతాం. ఆయన దృష్టిలో మనం హీరోలం అవుతాం. ఇంకా చెప్పాలంటే ఆయన దృష్టిలో మనం హీరోలమే! కారణం ఆయన మీద జరిగే హింసను జరగకుండా చూశాం గనుక. ఆపాము కనుక.

ఆలోచించండి మీ మీద జరిగే హింసను ఎవరైనా ఆపితే, అడ్డుకుంటే వారిని మీరు ఎంత ప్రేమిస్తారో! ఇష్టపడతారో! అందుచేత **"హింస ఆపడమంటే హింసింపబడే వారి ప్రేమను పొందడమే"**. చిన్న ఉదాహరణ చూద్దాం.

ఏ సినిమాలు చూసినా మూడు ముఖ్య పాత్రలు వుంటాయి. (1)హీరో, (2) హీరోయిన్, (3) విలన్. ఇంచుమించు అన్ని సినిమాలలో కథలు వేరువేరుగా వుండవచ్చు కానీ సారాంశం ఒక్కటే. ఎందుచేతనంటే ఏ సినిమాలో చూసినా మొదట్లో విలన్ హీరోయిన్‌ను బాధిస్తాడు, నిర్బంధిస్తాడు, బలవంతం చేస్తాడు, బలాత్కరిస్తాడు. ఆవిడ మానాన్ని కూడా అపహరించడానికి ప్రయత్నిస్తాడు. అలాంటి సందర్భంలో సడన్‌గా హీరో రంగ ప్రవేశం చేస్తాడు. విలన్‌కు దేహశుద్ధి చేసి తరిమి వేయడం కానీ, శిక్షించటం కానీ, చంపడం కానీ చేస్తాడు. అలా హీరోయిన్ మీద అత్యాచారం జరగకుండా చూస్తాడు.

ఇక్కడ మనం గమనించినట్లయితే అలా రక్షింపబడిన హీరోయిన్ ఆనందం పట్టలేక హీరో చేసిన పనికి ఆనందంతో పరవశించిపోతుంది. వెంటనే హీరో ప్రేమలో పడిపోతుంది. తన సర్వస్వం హీరోనే అంటుంది. అన్నీ సమర్పించు కోవడానికి కూడా వెనుకాడదు. కారణం తన మీద జరిగే హింసను ఆపాడు కనుక, అడ్డుకున్నాడు కనుక, తనకు మంచి చేసాడు కనుక, హితం చేసాడు కనుక.

అలాగే నిజజీవితంలో మనం ఆలోచిస్తే కోడిని హీరోయిన్ అనుకోవచ్చు. కోడి అంటే ఎవరో కాదు దైవస్వరూపమే. అంటే దేవుడే. అలా కోడిని హింసించేవారు ఎవరైనా సరే విలన్ అవుతారు. అలాంటి విలన్ నుండి హీరోయిన్ అంటే కోడిని, అంటే దేవుడిని మనం కాపాడ గలిగితే, అంటే మాంసం మాన్పించగలిగితే మరి

మనం దేవుని దృష్టిలో ఖచ్చితంగా హీరోలు కాగలుగుతాం. అంటే భగవంతుని ప్రేమను పొందగలుగుతాం. భగవంతుని ఆనందపరచగలుగుతాం. ఆయన దృష్టిలో గొప్పవారం కాగలుగుతాం. ఆయన ప్రేమకు పాత్రులు అవుతాం.

అలా దేవుడిని ఆనందపరచాలన్నా, ఆయన ప్రేమను పొందాలన్నా, ఆఖరికి ఆయననే పొందాలన్నా మనం కూడా అందరిచేతా మాంస భక్షణ మాన్పించాలి. ఆ ప్రయత్నం చెయ్యాలి. ఎలాగైనా సరే, ఏ రకంగా ప్రయత్నించైనా సరే!

అంటే భూత దయ గురించి, జీవహింస వల్ల నష్టాల గురించి, మాంసం తినడం వల్ల వచ్చే నష్టాల గురించి, దేవుని రూపాలను హింసించడం వల్ల వచ్చే పాపం గురించి వివరంగా వివరించగలగాలి. 'భూతదయ'పై మహాపురుషుల సందేశాలను తెలియచెయ్యాలి. నోటితో చెప్పడం గానీ, కరపత్రాల ద్వారా తెలియచేయడం గానీ, శాకాహార ప్రాముఖ్యం కలిగిన పుస్తకాలు పంచడం ద్వారా గానీ, ఏ రకంగానైనా సరే ఆ ప్రాణులకు హితం చేయాలి. ఆనందం కలిగించాలి. ఒక రకంగా మానవుడు చేయగలిగిన గొప్ప కార్యం ఇంతకన్నా లేదు.

ఇదే విషయం శాస్త్రాలు చెపుతున్నాయి. యోగులు, మహాత్ములు, మహాపురుషులు చెప్పారు. వారంతా అలా ఆచరించి మరీ చెప్పారు. అందుకే గొప్పవారయ్యారు. అందుచేత మనం కూడా ఆ అమాయకపు మూగ జీవులకు శ్రీ కృష్ణ భగవానుడు చెప్పినట్లు హితం చేయాలి. జీవహింసను ఆపాలి. మాంస భక్షణ మాన్పించాలి. భగవానుని ప్రేమకు పాత్రులు కావాలి.

ముఖ్యంగా ధ్యానం చెయ్యమని చెప్పాలి. కారణం ధ్యానం ఎవరు చేసినా వారికి తెలియకుండానే వారు హింసను మానేస్తారు. మాంసం తినడం మానేస్తారు. అన్నిటి మీద 'దయ' చూపిస్తారు. 'భూతదయ' కలిగి వుంటారు. దైవత్వాన్ని సంపాదించుకుంటారు. **"దయ గల హృదయమే భగవన్నిలయం"** అని మళయాళ స్వామి వారు చెప్పారు కదా!





ఎవరైతే జీవహానికి, మాంసాహారానికి దూరంగా
ఉంటూ జీవ కారుణ్యంతో మసలుకుంటారో
వారి హితం కోరి సకల జీవరాసులూ
భగవంతుని చేతులెత్తి ప్రార్థిస్తాయి.

– తిరువళ్ళువార్

# రుచి గొప్పదా? దయ గొప్పదా?

లోకంలోని మానవులు జంతువులను క్రూరంగా చంపటానికి, వాటిపై దయ చూపకపోవటానికి ముఖ్య కారణం జంతువుల మాంసం యొక్క రుచికి అలవాటు పడటమే. మరి ఈ రుచి అన్నది ఎలా అలవాటయ్యింది? అంటే చిన్ననాటి నుండి వారి తల్లిదండ్రులు వారికి ఈ అలవాటు చెయ్యడమే.

కానీ ఆలోచిస్తే మానవులు అలా రుచికి బానిసై, రుచిని వదులుకోలేక తమ తోటి ప్రాణులైన, మూగ జీవులైన జంతువులను నిర్దాక్షిణ్యంగా, దయ లేకుండా హింసిస్తున్నారు. చంపుతున్నారు, భక్షిస్తున్నారు. అలా వారు రుచికే ప్రాముఖ్యం ఇస్తున్నారు కానీ 'దయా గుణం' యొక్క గొప్పతనాన్ని తెలుసుకోలేకపోతున్నారు.

ఒక రకంగా చెప్పాలంటే దయాగుణం అన్నది దైవంతో సమానం. దైవానికి దగ్గర కావడానికి, దైవత్వాన్ని పొందటానికి కావలసిన ముఖ్య గుణం. కానీ మానవులు రుచికి బానిస అవ్వడం వల్ల ముఖ్యమైన ఆ 'దయా' గుణాన్ని కోల్పోతున్నారు. దైవానికి దూరమవుతున్నారు. అంతే కాదు దైవాగ్రహానికి కూడా గురవుతున్నారు. చివరకు జీవితంలో కష్టాలపాలవుతున్నారు. కష్టాలతో భగవంతుని దయను అర్థించినా! ఎంత దీనంగా వేడుకున్నా! ప్రయోజనం లేకుండా పోతుంది. భగవంతుని దయ పొందే అర్హత కోల్పోతున్నారు. ఇదంతా ముఖ్యంగా రుచికి బానిస అవ్వడమే.

అందుచేత రుచికి ప్రాముఖ్యం ఇవ్వకూడదు. రుచికి బానిస అవ్వకూడదు. బెత్తెడు నాలిక రుచి కోసం మొత్తం జీవితాన్ని నరకప్రాయం చేసుకోకూడదు. అందుచేత రుచి కోసం నిర్దయులు కాకండి. మీకు రుచే ముఖ్యమనుకుంటే శాకాహారంతో అన్ని రకాల రుచులు ఆస్వాదించండి.

ఆలోచించండి "రుచికోసం పాపాలు చేసి కష్టాలు తెచ్చుకోవడం ఉత్తమమా? అలా కాకుండా 'దయ' చూపించి ఆనందంగా జీవించడం ఉత్తమమా?"

మహానుభావులు, యోగులు ఎప్పుడూ రుచికి ప్రాముఖ్యం ఇచ్చేవారు కాదు. వారు ఎంతసేపూ తమ సాధనలకి, ప్రకృతి ధర్మానికే ప్రాముఖ్యం ఇచ్చారు. గొప్పవారయ్యారు. శాశ్వత ఆనందాన్ని పొందారు. కారణం వారి జీవితంలో వారు దయకే ప్రాముఖ్యం ఇచ్చారు. దయాగుణంతో దివ్యులయ్యారు. దేవుళ్ళయ్యారు. అందుచేత మనం కూడా అన్ని జంతువుల పట్ల 'దయ' కలిగి వుందాం.



**"శరీరానికి సంబంధించిన రుచులన్నీ దుఃఖ కారణమే అవుతాయి"**
**"రుచులన్నంతవరకు పరమాత్మతో చెలిమి వుండదు" - గురునానక్**

# దేహ బలమా? దయా బలమా?

మానవులు ఎంత సేపూ దేహ బలానికే ప్రాముఖ్యం ఇస్తారు. దేహబలాన్ని చూసి మురిసిపోతుంటారు. అలాంటి దేహ బలం కోసమని జంతువులపై దయ చూపించరు. నిర్దాక్షిణ్యంగా చంపి వాటి మాంసాన్ని భక్షిస్తూ వుంటారు.

మాంసం తినకపోతే బలహీనులమవుతామని, ఏ పని చెయ్యలేమని, ఎందుకూ పనికి రాకుండా పోతామేమోననే అపోహ చాలా మందిలో తరతరాల నుంచి కొన్ని వర్గాలలో నాటుకుపోయింది. అందుచేత చాలా మంది తల్లిదండ్రులు పిల్లల చేత బలవంతంగా మాంసం తినిపిస్తారు. తినకపోతే దండించే వారు కూడా వున్నారు. వారి అభిప్రాయం మాంసం తింటేనే మనిషి. లేకపోతే దీనికి పనికి రాడనే వారి లెక్క. వారు అంతకన్నా ఆలోచించరు.

అలాంటి తల్లిదండ్రుల వల్ల మాంసం ఇష్టం లేని చాలా మంది పిల్లలు ఎంతో మానసిక వేదన అనుభవిస్తున్నారు. తల్లిదండ్రులకు తమ బాధ చెప్పుకోలేక, చెప్పినా వారు వినక నరకమే అనుభవిస్తున్నారు. దీనికంతటికీ కారణం మాంసం తింటే బలమనే అపోహ.

కానీ దేహబలం అన్నది తాత్కాలికం మాత్రమే. కారణం దేహాన్ని ఎంత బలిష్టంగా తయారు చేసినా! ఆ జంతువులను చంపడం వల్ల వచ్చిన పాపాల వల్ల రోగాల పాలై ఎన్నో సంవత్సరాలు కష్టపడి పెంచిన కండలన్నీ కొద్ది రోజుల్లోనే కరిగిపోతాయి. దుక్కలాంటి వాడు బక్కలా తయారవుతాడు. ఏనుగు లాంటి వాడు పీనుగైపోతాడు. అంతేకాదు ఏమీ లేక పోయినా వృద్ధాప్యం వస్తే ఎంతటి బలవంతుడైనా బలహీనుడైపోవలసిందే! అందుచేత బలం అన్నది తాత్కాలికమే అని తెలుసుకోవాలి. బలానికి ప్రాముఖ్యం ఇచ్చినా ప్రయోజనం లేదని తెలుసుకోవాలి. బలమని చెప్పి జంతువులను 'దయ' లేకుండా చంపితే నష్టపోయేది తామేనని తెలుసుకోవాలి. అంతేకాదు శాకాహారంలో కూడా మానవునికి కావలసిన బలం వుందని తెలుసుకోవాలి.

శాకాహారులు కూడా బలిష్టంగా వుండేవారని, ఎన్నో పనులు అలసట లేకుండా చేయగలిగేవారని చరిత్ర తిరగేస్తే మనకు తెలుస్తుంది. అలాంటి వారిలో శాకాహారి అయిన కోడి రామకృష్ణ గారు, కండలు కలిగి, బండలు అవలీలగా ఎత్తగలిగేవారని, వారి ప్రదర్శనలు అందరినీ ఆశ్చర్యచకితులను చేసేవని, వారి గురించి తెలుసుకుంటే మనకు తెలుస్తుంది.

అందుచేత బలం, బలం అంటూ 'దయ' లేకుండా ప్రవర్తించి జీవితాన్ని కష్టాల పాలు చేసుకోకండి. శారీరక బలం కంటే 'దయా బలమే' గొప్పదని తెలుసుకోండి. కారణం దయవున్న వారి దగ్గర 'దైవ బలం' తోడు వుంటుంది. ఒక రకంగా చెప్పాలంటే వారు దేవుని దయకు పాత్రులవుతారు. జీవితంలో అన్నీ లాభాలు పొందుతారు. అన్ని సమస్యలు, భగవంతుని 'దయ' వలన అధిగమిస్తారు. ఆనందంగా జీవిస్తారు. అంతేకాదు 'దయ' చూపిన వారి కొరకు ఆ జీవులు కూడా ప్రార్థిస్తాయి. అందుచేత 'దేహబలం' కంటే 'దయా బలం' గొప్పదని తెలుసుకోండి. 'దయ' కలిగి వుండండి. జీవులపై 'దయ' చూపండి. క్రూరత్వాన్ని వదలండి.



# ఒక మేక 'ఆత్మకథ'

నేను అన్ని జీవులలాగే భగవంతునిచే సృష్టించబడిన ఒక మేకను. నేను ఎన్నో ఇతర జంతువుల లాగే, అనేకానేక జన్మలు తీసుకున్న తర్వాత, నేను నా మేక తల్లి గర్భాశయంలో ప్రవేశించగానే జుగుప్సాకరమైన పంజరంలో అయిదు మాసాల పాటు బంధనంలో ఉన్నట్లు బాధపడి జన్మించిన తర్వాత, ఈ భూప్రపంచం జీవించడానికి అనువుగా చక్కని మరియు ఆహ్లాదకరమయిన ప్రదేశంగా నాకనిపించింది.

నా యజమాని మరియు అతని చిన్న పిల్లలు నన్ను ఎంతో మురిపెంగా చూసుకుంటూ తమ ఒడిలో పెట్టుకుని లేలేత ఆకుల్ని నాకు తినడానికి ఇచ్చేవారు. నా తల్లిపాలు త్రాగుతూ నేను త్వరితగతిన పెరగనారంభించాను. ఆ యజమాని నన్ను ఆప్యాయంగా చరుస్తూ తన వ్యవసాయ క్షేత్రానికి తీసుకుపోయేవాడు. అక్కడ నేను స్వయంగా పచ్చని ఆకులను తినేదాన్ని. నేను నా శరీరంలోని వ్యర్థపదార్థాల్ని అతని చేతిలో విసర్జించినప్పటికీ అతను బాధపడేవాడు కాదు. అందుకు గల కారణమేమిటో నేను నా తల్లిని అడిగినప్పుడు, మన వ్యర్థపదార్థాలు అతని చేలోని మొక్కలకు ఎరువుగా రూపొంది అధిక దిగుబడిలిస్తాయని నాకు చెప్పింది. అందువల్లనే కాబోలు అతనికి నామీదెన్నడూ కోపం రాలేదనుకుంటాను.

కాలం గడిచిపోతుంటే నేను నా సహచరులతో పాటు జీవించసాగాను. ఒకటిన్నర ఏడాది తరువాత మా యజమాని, నా సహచరులు 40–50 మందితో పాటు నన్నూ తీసుకొచ్చి మమ్మల్నందర్నీ ఓ అపరిచితుడి ముందు సమూహంగా నిలబెట్టాడు. ఆ తరువాత ఒక పెద్ద మోటారు వాహనం అక్కడికి వచ్చాక మమ్మల్ని అందులోకి వెళ్ళేట్టు బలవంతం చేశారు. నేను నా తల్లి దగ్గరకు పోవాలనుకున్నాను కానీ వీలుపడలేదు. నేను నా తల్లివైపు కదలగానే వికృతంగా చూస్తున్న మనిషొకడు కర్రతో నన్ను బాదాడు. నిస్సహాయంగా మేము వాహనంలోకి చేరాము. గుంపులో ఒకరి మీద ఒకరు పడడం వల్ల నాకు తల తిరిగినట్టయింది. నా సహచరులు కూడా కళావిహీనమయిన ముఖాలతో ఉన్నారు. ప్రతియొక్కరి మొహంలోనూ భయం అలుముకోవడంతో పాటు, వాహనం అటూ ఇటూ ఒరుగుతున్నప్పుడల్లా మా చర్మం ఒరుసుకుపోసాగింది. పగలు పోయి రాత్రి వచ్చింది. మరో పగలూ–రాత్రీ

గడిచిపోయాయి. కానీ మోటారు వాహనం ఆగకుండాపోతూ నే వుంది. వాహనం యజమానులు రెండుసార్లు కొంత ఆహారం వేశారు కాని అది మా కడుపు సగం కూడా నింపడానికి చాల్లేదు. ఆ మరుసటి రోజు ఓ మహానగరంలో వాహనం ఆగింది. ఒక ఎత్తైన గడ్డం మనిషి వాహనాన్ని సమీపించి వాహన యజమానికి ఏదో ముట్టజెప్పగానే మేమందరం అతని స్వాధీనం కాబడ్డాము. మా కొత్త యజమాని కర్రలతో అదిలిస్తూ మమ్మల్ని ఓ ఇంటికి తీసుకెళ్ళాడు. అతను మమ్మల్నందర్నీ ఎండలో నిల్చునేలా చేయడంతో పాటు వేడి కిరణాల వలన కలిగిన అలసట, ఆకలి మరియు దప్పిక, వీటన్నింటినీ మించి కర్రభయం మమ్మల్ని మరణానికి దగ్గరగా లాక్కువెళుతున్నాయి.

సుదీర్ఘ కాలం వేచియున్న తరువాత మమ్మల్ని ఓ ఇంట్లోకి నెట్టారు. అక్కడ కూర్చున్న ఒక మనిషి తన చెవులకు అమర్చుకున్న ఓ గొట్టం సహాయంతో నా సహచరులందరినీ పరీక్షించసాగాడు. మా వంతు వచ్చేసరికి మా యజమాని అతనికేదో ముట్టజెప్పగానే, మమ్మల్నెలాంటి తనిఖీ చేయకుండానే లోపలికి పంపాడు. నేను ఇదేమిటో అర్థం చేసుకోలేకపోయాను. కానీ నా సహచరుల్లో కెల్లా పెద్దదయిన ఓ మేక, అతను ఒక వైద్యుడనీ, దీనర్థం మనకు చావు ముంచుకొస్తుందనీ తెలియచేసింది.

అప్పటికే ఆకలి-దప్పికలతో అలసి పోవడం వల్ల సగం చచ్చిన నాకు, ఇది వినగానే తినాలన్న కోరిక ఇగిరిపోయి ఆ తిండినీ తినలేకపోయాను. నీరు కూడా నా గొంతును చల్లార్చే బదులు బాధకలిగించింది. ఆ తరువాత ప్రక్కనున్న గది తలుపు తెరవగానే నేను చూసిన దృశ్యం నన్ను భయంతో వణికి పోయేలా చేసింది. నా కాళ్ళ మీద నేను నిలబడే సత్తువ పోయి నా కళ్ళు బైర్లు కమ్మాయి. నా సహచరుల అరుపులు-పెడబొబ్బలు ఆ గది నుండి వినిపించగానే నాకు కన్నీరాగలేదు.

నేను అరచి కేక వేయాలని ప్రయత్నించాను గాని గొంతుపెగలక నోటినుంచి కేక బయటపడలేదు. నేను బయటికి పారిపోవడానికి ప్రయత్నించాను. అయితే ఒకతను నా వెనుక కాళ్ళను రెండింటినీ బంధించి, రాక్షసుడిలాంటి ఓ భయానక వ్యక్తి పెద్ద కత్తితో నా సహచరులలో ఒకరి కుత్తుకను నరికి వేస్తున్న గదిలోకి త్రోసాడు. యాదృచ్ఛికంగా నా మనసులో ఓ ఆలోచన మెరిసింది. **"ఇతను ఋషులు మునులు మరియు మహనీయుల వారసుడినని చెప్పుకుంటూ సానుభూతి, అహింసలాంటి పాటలు పాడే మనిషీ ఒకరేనా?"** అని. కాదు, ఇతను

## ప్రేమతో పెంచేది... క్రూరంగా చంపడానికా?





## మనం మానవులం - దయ చూపడమే మన ధర్మం

ఆ మనిషి కాదు! ఎందుకంటే మాంసాహారులయిన క్రూర జంతువులు కూడా ఇలాంటి మరణహోమాన్ని చేయటానికి ఇష్టపడని పనులు చేస్తున్నాడితను. అలా నా మనసులో ఆలోచనలు కదులుతుండగా ఒకడు నా చెవులను పట్టుకుని ఆ భయానక వ్యక్తి వైపు నెట్టాడు. బాధ ఇప్పుడు కోపావేశంగా మారింది. అక్కడ్నుంచి బయటపడాలని ప్రయత్నిస్తూ నేను గింజుకున్నాను. కానీ ఫలితం శూన్యం. తప్పించుకోవాలన్న నా ప్రయత్నాలు ఫలించకపోవడం వల్ల నా రక్తం ఉడికిపోయి నా నోటి నుండి నురగలు రావడం మొదలయ్యాయి. నా ప్రమేయం లేకుండానే మల-మూత్రాలు విసర్జించాను. అయినా, ఎవరూ నా నిస్సహాయస్థితిని చూసి జాలిపడలేదు సరికదా, మరో ఇద్దరు వ్యక్తులు నన్ను పట్టుకుని, ఒకడు నా కాళ్ళు బంధించగా మరొకడు నా గొంతు కోయడం మొదలుపెట్టాడు. నా కుత్తుకలోంచి రక్తం జివ్వున చిమ్మి నా శరీరమంతా బాధలు అలుముకున్నాయి.

తక్షణ మరణాన్ని కోరుకోవడం తప్ప ఇప్పుడు మరో దారి లేదు. వాళ్ళు సుదీర్ఘకాలం నా శరీరాన్ని బాధ పెట్టకుండా ఒక్కవేటుతో నన్ను చంపాలని కోరుకున్నాను. అయితే అదీ నెరవేరలేదు. కత్తి అప్పటికి నా గొంతులో సగం మాత్రమే దిగబడింది కనుక వాళ్ళు నన్ను మరింత యాతనకు గురిచేశారు. చావు ఇంకా సుదూర తీరంలో వుండి నరకయాతన అనుభవించే ప్రతిక్షణమూ ఓ యుగంగా గడవసాగింది. నా చావు తొందరగా సంభవించాలని కోరుకుంటూ భగవంతుడిని స్మరిస్తూ మరణం కోసం ఎదురుచూస్తూ ప్రార్థించసాగాను.

నా కళ్ళముందు చీకటి తెరలు తొలగిపోవడం మొదలవగానే నేను స్పృహ కోల్పోసాగాను. బహుశా ఊపిరి కూడా ఆగిపోయుంటుంది. చూడగా నేను

చనిపోయినట్టుంది. మరణ సందేశాన్ని తెచ్చినవారు నన్ను పైకి తీసుకు పోతున్నట్టుంది. కానీ, ఆగు! ఇదేమిటి! నా శరీరం ఇంకా జంతువధశాలలోనే పడుంది. ఇద్దరు వ్యక్తులు నా చర్మాన్ని దాని వెనుక దాగున్న మాంసం మరియు క్రొవ్వు నుండి వేరు చేస్తూ లాగుతున్నారు. వారు చర్మాన్ని మరోవైపు పడవేశారు. కాస్సేపటి తరువాత ఓ వ్యక్తి నా మాంసాన్ని ఖరీదు చేసి ఒక భోజనశాల **(HOTEL)** లోని వంటగదిలోకి తీసుకు పోయాడు. అక్కడ మరోవ్యక్తి నా మాంసాన్ని చిన్న చిన్న ముక్కలుగా నరికాడు. బహుశా ఈ హింసాకృత్యాలన్నీ దేవుడిలాంటి ఈ మనిషికి చాలా అల్పమయినవిగా అనిపిస్తాయేమో, ఎందుకంటే గాయాలమీద ఉప్పురాయడం ఇతని వంశపారంపర్య అలవాటేమో, అదింకా కొనసాగుతుంది.

నా మాంసాన్ని ముద్దగా మార్చిన తరువాత అతను ఉప్పు-కారాల్ని చేర్చడమే కాదు, మంటల మీద నన్ను ఉడికించాడు. పర్యవసానంగా అతని యొక్క ఆటవిక ప్రవృత్తి బయటపడింది. మరో వ్యక్తి నా మాంసాన్ని ఓ ప్లేటులో సర్ది వంటగది నుండి అందంగా అలంకరింపబడిన ఒక పెద్దగదిలో సుఖాసీనులయిన ఓ యువజంట వైపు తీసుకెళ్ళగానే ఆ తరువాతేం జరుగుతుందా అని అచ్చెరువొందుతున్నాను. తమ ముందు ప్లేటును పెట్టిన మరుక్షణం, జంటలోని పురుషుడు ఎంతో ప్రియంగా నా మాంసాన్ని తినడం ప్రారంభించాడు. అయితే అతనికెదురుగా కూర్చున్న స్త్రీకి మాంసం తినడం ఇష్టం లేనట్లుంది కానీ తన భర్తకు కేవలం తోడు ఇస్తున్నట్లుగా తోచింది.

ఇప్పటికి నేను 'యమధర్మరాజు' యొక్క ఆస్థానంలో వరుసగా నిలుచున్న ఎన్నో ఆత్మలతో పాటు చేరాను. ప్రతియొక్కరి పాప-పుణ్యాల కృత్యాలను బిగ్గరగా వివరిస్తున్న 'చిత్రగుప్తుడు' నా దృష్టినాకర్షించాడు. నా వంతు రాగానే, నేను నా గత జన్మలో మేక మాంసంతో విందునిచ్చానని చిత్రగుప్తుడు చెప్పాడు. తత్ఫలితంగా నేను మేకగా జన్మించి నా మాంసాన్ని ఇతరులకివ్వవలసి వచ్చింది.

నేను చూసిన భోజనశాలలో నా మాంసాన్ని తింటున్నటువంటి వ్యక్తులు గతజన్మలో నేనెంతగానో ప్రేమించి నా జీవిత సర్వస్వాన్ని ధార పోసిన నా సంతానమేనని ఆయన తేటతెల్లం చేశాడు. 'ఇప్పుడు నీ మాంసాన్ని తింటున్నవారు మరుజన్మలో ఇటువంటి శిక్షనే అనుభవిస్తారు' అని వినగానే నా ఆత్మ క్షోభించింది. నేను అనుభవించిన నరకయాతన లనే నా తరువాతి తరంవారూ అనుభవించాలని నేనెలా కోరుకుంటాను? అందువల్ల వాళ్ళను క్షమించమని, నేను కూడా వాళ్ళను క్షమించాను గనుక నాకెటువంటి ప్రతీకార కాంక్షలేదని యమధర్మరాజుగారిని

అర్థించాను. ఆయన నన్ను జాలిగా చూసి, ఒక మేకగా నువ్వు కేవలం ఆకులు–అలమలనే తిన్నావు. అంతేకాదు ఎవరికీ అపకారం చేయలేదు. పైగా నిన్ను హింసించిన వారినందర్ని క్షమించావు గనుక మరుజన్మలో నువ్వు మానవుడిగా పుడతావు అని దయతో ఆశీర్వదించారు. ఆ విధంగా మానవ జీవితాన్ని పొందేందుకు నా ఆత్మను భూమికి పంపించారు.

నా తరువాయి జన్మలోకి రాగానే, ఇప్పుడు నేను ఎంతో మానవత్వంతో మరియు సత్యం– అహింసా ధర్మాలతో ప్రవర్తించాలని ప్రతిజ్ఞ చేసుకున్నాను: పక్షులు మరియు జంతువులను చంపడం లేక మాంసం తినడం లాంటివి మానేయాల నుకున్నాను. ఏ జీవినీ బాధించకూడదని ఎటువంటి హాని కలిగించకూడదని ప్రతి జీవినీ రక్షించాలి అనుకున్నాను. ఈ చింతనలతో నా కొత్త తల్లి గర్భాశయంలో ప్రవేశించాను. అలాగే మానవత్వమున్న మానవునిగా నా కొత్త జీవితం ప్రారంభమయ్యింది.

ఈ మేక ఆత్మ కథ చదివిన తరువాతనైనా క్రూరమైన మాంసభక్షణ మానండి. కొన్ని జన్మలు నరకాన్ని అనుభవించి తెలుసుకునే సత్యాన్ని ఇప్పుడే తెలుసుకోండి. జీవ హింస చేయకండి. మాంసభక్షణ మానండి. సహోదరులైన జంతువులను ప్రేమించండి. వాటిపై దయ చూపండి.

జంతువులకు వృక్షాలకు చాలా తేడా వుందని తెలుసుకోండి. వృక్షాల కొమ్మలు మరియు ఆకులు చెట్టునుండి విడిపోతే, వాటి స్థానంలో కొత్తవి పుట్టుకొస్తాయి. చాలా మొక్కలు వాటిని కత్తిరించడం వల్లనే పెరుగుతాయి. కత్తిరించిన మొక్కలు నాటబడతాయి. అయితే ఇవన్నీ పక్షులు మరియు జంతువుల విషయంలో అసాధ్యం. జంతువు యొక్క ఏ శరీరావయవమూ దాన్ని కత్తిరించిన తరువాత పెరగదు. మనిషి మొక్కలకు మాదిరిగా జంతువులను భూమి నుండి పెంచలేదు.

మాంసం తిని వేలాది టన్నుల పాపభారాన్ని మోయడం కన్నా శాకాహారం భుజించి కొన్నిగ్రాముల పాపభారాన్ని మోయడం ఉత్తమోత్తమం. అందుచేత శాకాహారం శ్రేష్టమని మాంసాహారం పాపాహారమని తెలుసుకోండి. మాంసాహారం మానండి. ధ్యానం చెయ్యండి.

(సస్యాహారమా? లేక మాంసాహారమా? అనే పుస్తకం నుండి)

**మనం మానవులం దయ చూపడమే మన ధర్మం**

# భూత దయ గురించి వివిధ మతాలు

## హిందూమతం



### భగవద్గీతలో భూత దయ గురించి

భూతదయ గురించి భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు అనేక సందర్భాలలో పేర్కొనడం జరిగింది. జీవులను ఎందుకు హింసించకూడదు? జంతువులను హింసించడం వల్ల కలిగే నష్టాలు, వాటి పరిణామాలు చక్కగా వివరించడం జరిగింది.

మానవుడు కష్టాల నుంచి బైటపడాలంటే, అంటే ముక్తి పొందాలంటే అంటే సమస్యల నుంచి ముక్తి, రోగాలనుంచి ముక్తి, బాధలనుంచి ముక్తి, అశాంతినుంచి ముక్తి, కుటుంబ సమస్యల నుంచి ముక్తి , ఆర్థిక సమస్యలనుంచి ముక్తి, వార్ధక్య భాధలనుంచి ముక్తి లభించాలంటే ఆరాధనలు అంటే పూజలు, నోములు, వ్రతాలు, భజనలు, జపాలు లాంటివి చేస్తే సరిపోదు. వాటికంటే 'భూతదయ' అంటే జంతువులకు మంచిచేయడంలో ఆసక్తి కలిగివుండాలి, వాటిపై కరుణ చూపించాలి అంటే జీవులపట్ల కాఠిన్యం ప్రదర్శించకుండా వుండాలి. వాటితో స్నేహం చెయ్యాలి, అంటే అన్నిటిని సమభావంతో చూడాలి, వాటిలో భగవానుని చూడాలి, అంటే వాటి సుఖదుఃఖాలు తన సుఖ దు:ఖాలుగా భావించాలి, దీనికి జంతువులను బాధించకుండా ఉండాలి, హింసకు మూల కారణమైన మాంస భక్షణ మానాలి. ఇవి ఆచరించినప్పుడే కష్టాల నుంచి ముక్తి పొందగలరు. అంతే తప్ప హింస చేసేవారు ఎన్ని ఆరాధనలు చేసినా వ్యర్థమని భగవద్గీతను బట్టి గ్రహించవచ్చు.

అందుచేత **"గీతను పారాయణ చేయడం కాదు, భగవానుడు చెప్పింది పాటించాలి". "ఆయనను ఆరాధించడంకాదు ఆయన చెప్పింది ఆచరించాలి".** ఇది ప్రతి ఒక్కరూ గ్రహించవలసిన విషయం. కారణం **జీవులలో వున్నది**

**కూడా భగవానుడే! అంటే మనం ఎవరినైతే ఆరాధిస్తున్నామో ఆయనే!** అందుచేత జీవహింస చేసే వారు, మాంసభక్షణ చేస్తూ హింసకు కారకులయ్యేవారు షోడసోపచార పూజలు చేసినా భగవానుని ఆనంద పరచలేరు; కారణం **"సమస్త ప్రాణులు ఆయన రూపాలే! అన్నిటిలో ఉన్నది ఆయనే!"** అందుచేత 'అంతా ఒకటే' అని తెలుసుకోవాలి.

భగవద్గీతను భోధించే పెద్దలు, గురువులు, పండితులు హింస గురించి పెద్దగా ప్రస్తావించకపోవడం వల్ల సామాన్యులు, పామరులు మాంసభక్షణ తప్పుకాదన్నట్టు భావిస్తున్నారు. పాపం కాదనుకుంటున్నారు. తరతరాల నుంచి ఆచారంగా వస్తుందని, మాంసం తింటే బలమని, రుచిగా వుంటుందనే అపోహతో తాము తినటమే కాదు చిన్ననాటి నుండి పిల్లలను కూడా తినమని ప్రోత్సహిస్తున్నారు. బలవంతం చేస్తున్నారు. తినకపోతే వత్తిడి చేస్తున్నారు. అంతకన్నా ఆలోచించటం లేదు.

మాంసం అంటే చనిపోయిన జంతువని, మృతాహారమని, రక్తపుకూడు అని ఆలోచించలేక పోతున్నారు. రక్తమాంసాలు మానవుని ఆహారం కాదని. జీవులను చంపడం పాపమని తెలుసు కోలేకపోతున్నారు. అవి అమాయకపు, అసహాయ, మూగజీవులని, అవి కనీసం తమ బాధను, తమ కష్టాన్ని కూడా చెప్పుకోలేని స్థితిలో వున్నాయని మానవులు ఆలోచించడంలేదు. అంతేకాదు తాము మానవులమని, మానవత్వమే తమ సహజ లక్షణమని, క్రూరత్వం, రాక్షసత్వం తమ లక్షణం కాదని గ్రహించలేకపోతున్నారు. సృష్టిలోని సమస్త జీవులు అంటే మానవునితో సహా భగవంతుని సృష్టిలోనివేనని, అన్నీ ఆయన రూపాలేనని, అన్నిటిలో వున్నది ఆయన శక్తేనని, అన్నీ ఆయన బిడ్డలేనని గ్రహించలేకపోతున్నారు.

అందుచేత బాగా ఆలోచించాలి **"భగవంతుని పూజించడం కాదు భగవంతుడు బోధించింది ఆచరించాలి".**

భగవద్గీతలో జీవహింస గురించి లేదని అనుకోకండి. కచ్చితంగా హింస చేయవద్దనే చెప్పబడింది. **"అహింసే అన్నిటికంటే గొప్ప ధర్మమని చెప్పబడింది".** అందుచేత **"జీవహింస చేయకండి మాంసభక్షణ మానండి".**
**భగవద్గీతలో భగవానుడు భూతదయ గురించి చెప్పిన విషయాలు చూద్దాం:–**

ఆయన ఈ క్రింది శ్లోకం ద్వారా అన్ని జీవులలో వున్నది తానేనని

స్పష్టంగా చెప్పడం జరిగింది.

**శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థిత:**
**అహమాదిశ్చ మధ్యంచ భూతానామన్త ఏవచ. (భ.గీ 10-20)**

తా: ఓ అర్జునా! సర్వప్రాణులలో స్థితమైవున్న ఆత్మను నేనే అయివున్నాను. మరియు ప్రాణులయొక్క ఆదిమధ్యాంతములు నేనే అయివున్నాను.

పై శ్లోకార్ధం ద్వారా సమస్త జీవులు భగవంతుని స్వరూపాలేనని తెలుసుకోవచ్చు. అందుచేత వేటిని హింసించినా భగవంతుని హింసించినట్టే! ఇదే విషయం ఈ క్రింది శ్లోకంలో చెప్పడం జరిగింది.

**శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున**
**సుఖం వా యది వా దు:ఖం స యోగీ పరమో మత:. (భ.గీ 6-32)**

తా:- ఓ అర్జునా! ఎవరు సమస్త ప్రాణులయొక్క సుఖముగాని, దు:ఖముగాని తన సుఖ దు:ఖములుగా చూస్తాడో వాడే అందరిలో నాకెక్కువ ప్రియుడు.

ఈ శ్లోకం ద్వారా తన శరీరానికి కలిగిన బాధ తనకు ఎంత కష్టంగా వుంటుందో అలాగే సమస్త జంతువుల యొక్క బాధ కూడా వాటికి అంత కష్టంగా వుంటుందని తెలుసుకుని ఆ రకంగా ప్రవర్తించిన వాడే భగవానునికి ఇష్టుడు కాగలడని మనం తెలుసుకోవచ్చు. అంటే భగవానునికి ఇష్టులు కావాలంటే షోడసోపచార పూజలు చేస్తే లాభం లేదు. జీవహింస, మాంసభక్షణ చేయకూడదని, భూతదయ కలిగి వుండాలని తెలుసుకోవాలి.




అన్నీ భగవంతుడే అని గ్రహించక జీవహింస చేసేవారికి ఎలాంటి గతి పడుతుందో శ్రీకృష్ణ భగవానుడు ఈ క్రింది శ్లోకాల ద్వారా వివరించారు.

**శ్లో॥ తానహం ద్విషత: క్రూరాన్ సంసారేషు నరాధమాన్**
**క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు. (భ.గీ 16-19)**

తా:- ఆ ప్రకారము సమస్తప్రాణులలో ఆత్మ స్వరూపుడినైవున్న నన్ను హింసించు

క్రూరులైన, దుష్టులను జననమరణములతో ఉండు దు:ఖ కరమైన ఘోర సంసారమందు మాటి మాటికి పడవేసి వారిని బహు దు:ఖకరమైన అసుర యోనులందు పుట్టించెదను.

**శ్లో॥ అసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని।**
**మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥ (16-20)**

తా:- ఓ అర్జునా! అసురయోనియందు పుట్టిన ప్రాణిహింసకులైన మూఢులు ప్రతి జన్మమునందు నన్ను పొందుమార్గము తెలియక ఇంకా అధోగతి పొంది బహుకాలం దు:ఖ భూయిష్టమైన ఘోర నరకమును పొందుదురు.

ఈ విధంగా పై శ్లోకాల ద్వారా సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ గీతలో "జీవహింస మాంసభక్షణ" వల్ల వచ్చే నష్టాల గురించి తెలియజేసియున్నారు. అంతేకాదు జీవహింస చేసేవారు భగవంతుని పొందలేరని, ఆయన ఎవరో తెలుసుకోలేరని, భగవానుని పొందగలిగే మార్గం కూడా తెలుసుకోలేరని, అలా ఎన్నో జన్మలు దుఃఖంలోనే జీవిస్తారని, భగవానుడు చెప్పడం జరిగింది.

అందుచేత జంతు వధ, జంతు బలులు మానాలి. అంతేకాదు ఆయన అన్ని జంతువులను ప్రేమించే వారే తనకు ఇష్టులని ఈ క్రింది శ్లోకంలో చెప్పారు.

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్ర: కరుణ ఏవచ**
**నిర్మమో నిరహంకార: సమదు:ఖసుఖ: క్షమీ. (భ.గీ 12-13)**

తా:- సమస్త ప్రాణులయెడల ద్వేషములేనివాడును, మైత్రి, కరుణగలవాడును, అహంకార మమకారములు లేనివాడును, సుఖదు:ఖములందు సమభావము గలవాడును, ఓర్పుగల వాడును, ఎవడుకలడో, అతడు నాకు ఇష్టుడు.

**శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి. (భ.గీ 5-29)**

తా:- యజ్ఞములయొక్క తపస్సుల యొక్క ఫలములనుభవించువాడుగను, సమస్తలోకముల యొక్క శాసకుడుగను, **సమస్తప్రాణుల యొక్క హితకారిగను,** నన్నెఱిగి మనుజుడు శాంతిని పొందుచున్నాడు.

ప్రస్తుతం అందరికీ అన్నీ వున్నాయి కానీ ఎవరికి శాంతి లేదు. దీనికి ముఖ్య కారణం పై శ్లోకం ద్వారా భగవానుడు చెప్పడం జరిగింది. ఆయన సందేశమేమిటంటే **ఆయనచే సృష్టింపబడిన 84 లక్షల జీవుల యొక్క ఆనందం ఆయన కోరుకుంటాడని ఎవరైతే తెలుసుకుని ఆ ప్రకారం ప్రవర్తిస్తారో వారే**

శాంతిని పొందుతారని చెప్పడం జరిగింది. అందుచేత శాంతిగా జీవించాలనుకునేవారు భగవానునికి తాము మాత్రమే ఇష్టులమని భావించకండి. అంటే మానవులు మాత్రమే ఇష్టులవుతారని భావించకూడదు. ఆయనకు జంతువులతో సహా అందరూ ఇష్టులే. ఆయన అందరి హితము కోరేవాడని అర్థం చేసుకోవాలి. జంతువుల మీద అమాయకపు మూగ జీవుల మీద 'కారుణ్యం' చూపించాలి. వాటిపైన 'దయ' చూపించాలి,



## మనుస్మృతి :-

**"నా కృత్వాప్రాణినాం హింసా మాంసముత్పద్యతే కృచిత్**
**నచ ప్రాణీవదః స్వర్గస్త స్మాన్మాంసం వివర్జయేత్ (5-4)"**

తా:- ప్రాణులను చంపకుండా మాంసము లభించదు. ప్రాణుల హత్య సుఖదాయకము కాదు. కాబట్టి మాంసాహారమును వదిలి వేయుటకు ఎల్లప్పుడు శ్రేయస్కరము.



మాంసభక్షణ వేదాది శాస్త్రములకు విరుద్ధ మైనది. అంతేకాదు ఘోర హింసా పాపములకు మూలం కాబట్టి ఎవరైనా మాంసము తినేవాడు శాస్త్ర దృష్టిలో దుష్ట బోజి అనబడతాడు.



## మహాభారత అనుశాసన పర్వం :-

**"యే భక్షయంతి మాంసాని భూతానాం జీవి తైషిణామ్**
**భక్షయంతి తేపి భూత స్తిరితి మేనాస్తి సంశయః॥"**



తా:- ఏ ప్రాణి తాను బ్రతికి ఉండాలని కోరుకుంటుందో ఆ ప్రాణిని చంపి మాంసము తినే వారు మళ్ళీ జన్మలో అట్టి ప్రాణుల చేతనే తినబడుతారనుటలో ఎట్టి సందేహం లేదు.



# క్రైస్తవ మతం

## భూతదయ గురించి జీసస్ క్రైస్ట్



క్రొత్త నిబంధన యొక్క అరమిక్ భాషలో చేయబడిన అనువాదంలో ఏసుక్రీస్తు యొక్క భావాలు :

"ఏసుప్రభువు ఇలా ఆజ్ఞాపించారు. 'నీవు ఎవరినీ చంపకు, ఎందుకంటే పరమేశ్వరుడు ప్రతి జీవికీ ప్రాణాన్ని ప్రసాదించాడు. ప్రభువు ఇచ్చిన దాన్ని మానవుడు లాగుకొనరాదు. నేను మీతో సత్యం చెపుతున్నాను, భూమిపై నివసించే ప్రాణులన్నింటికీ ఒకే తల్లి నుండి జీవనం ప్రాప్తించింది. అందువలన ఎవరు ఎవరిని చంపినా తన సోదరుడినే చంపుతాడు, భూమాత అతడి నుండి విముఖురాలై జీవనదాయకమైన తన స్తన్యాన్ని (పాలను) అతడికివ్వదు. **"దేవతలు అలాంటి వారిని ద్వేషిస్తారు. సైతాను వారి శరీరాలను తన నివాసంగా చేసుకుంటాడు"**. వారి శరీరంలో ఆ చంపబడిన జంతువుల మాంసము వారి (చంపిన వారి) సమాధిగా తయారవనారంభిస్తుంది. ఎందుకంటే నేను మీతో సత్యాన్ని పలుకుతున్నాను, (జీవిని) హత్య చేసినవారెవరైనా నిజానికి తమను తాము హత్య చేసికుంటారు. చంపబడిన జంతువుల మాంసం తిన్నవారెవరైనా మృత్యువును కౌగలించుకుంటారు. అతడి రక్తంలో ఆ (చంపబడ్డ జంతువుల) రక్తం యొక్క ప్రతి బిందువు విషంగా మారుతుంది. అతడి మాంసంలో వాటి మాంసం యొక్క దుర్గంధం రావటం ప్రారంభిస్తుంది. మరియు వాటి చావు అతడి చావు అయిపోతుంది. ఎందుకంటే **"సైతాన్ ప్రతి పైసాకు లెక్క అడుగుతాడు. అతడు కన్నుకు కన్ను, పన్నుకు పన్ను, చేతికి చేయి, కాలుకు కాలు, కాల్చదానికి బదులు కాలడం, గాయానికి బదులు గాయం, మృత్యువుకు బదులు మృత్యువు ఇస్తాడు"**. ఎందుకంటే పాపానికి ఫలం మృత్యువు. అందువలన ఎవరినీ హత్య చేయకు. మూగజీవుల మాంసాన్ని తినకు. లేకపోతే నీవు తప్పక సైతానుకు గురి అవుతావు. ఎందుకంటే ఇది (చంపడం, మాంసాన్ని తినడం) బాధల మరియు దుఃఖాల మార్గం. ఇది మరణం వైపునకు తీసుకు పోతుంది.

"దేవతలు నీ జీవన మార్గంలో నీ సేవ చేసేందుకు గాను పరమేశ్వరుడి ఆజ్ఞను పాటించు, పరమేశ్వరుడి మాట ఆలకించు, 'చూడు, భూమి మీద గల ఫలభరితమైన వృక్షాలను, మూలికలను మరియు పశువుల పాలను నేను నీకు ఆహారంగా ఇచ్చాను. ప్రతి జంతువుకు నేను ఆకుపచ్చని తాజా చెట్లనిచ్చాను. మాంసాన్ని మరియు మాంసాన్ని తయారు చేసే రక్తాన్ని నీవు సేవించరాదు. **"నన్ను ప్రేమిస్తూ, నా ఆజ్ఞను పాటించే వారిపై దయ వర్షిస్తుంది".** అందువల్ల **"పరమేశ్వరుణ్ణి సంపూర్ణమైన మనసు, ఆత్మ మరియు శక్తితో ప్రేమించండి"**, ఇది నా మొదటి మరియు అన్నింటికన్న ముఖ్యమైన ఆజ్ఞ. రెండవ ఆజ్ఞ ఏమిటంటే **"నిన్ను నీవు ప్రేమించుకున్నట్లుగా నీ పొరుగు వారిని ప్రేమించు".** ఈ ఆదేశాల కంటే మించిన ఆజ్ఞ మరొకటి లేదు.

"ఈ మాటలను విన్న అందరూ మౌనం వహించారు. కానీ వాళ్ళలోంచి ఒకరు ఇలా ప్రశ్నించారు, 'ఓ స్వామీ! అడవిలో ఒక క్రూరమృగం నా సోదరుడిపై దాడి చేస్తే నేను, నా సోదరుణ్ణి చనిపోనివ్వాలా? లేక ఆ జంతువును చంపాలా? ఆ జంతువును చంపడం వల్ల మీ ఆదేశాలను ఉల్లంఘించినట్లు కాదా?"

"ఏసుప్రభువు జవాబిచ్చారు, భూమి మీద మరియు నీటిలోనూ ఉన్న అన్ని జీవులు మానవుడికి సేవకులుగా చేయబడ్డాయని మొదటి నుండి ఆదేశము. ఈ భూమి మీద గల ప్రాణులన్నింటిలోనూ పరమేశ్వరుడు కేవలం మానవుణ్ణి మాత్రమే తన రూపంలో తయారు చేశాడు. **"మనిషి జంతువుల కోసం కాదు"**. కాబట్టి నీవు నీ సోదరుడి ప్రాణాలను రక్షించడానికి ఆ అడవి జంతువును చంపితే అది ఆజ్ఞను ఉల్లంఘించడం కాదు. ఎందుకంటే మానవుడు జంతువు కంటే ఉన్నతుడని నేను సత్యాన్ని పలుకుతున్నాను. **"కానీ ఏ కారణం లేకుండా ఎవరైనా జంతువును చంపితే అంటే ఆ జంతువు అతడిపై దాడి చెయ్యనపుడు, వేట చేసే సరదా కోసం లేదా దాని మాంసం తినేందుకు గానీ, దాని చర్మం కోసం గానీ లేదా దాని దంతాల కోసం గానీ జంతువును చంపితే, ఆ పని పాపంతో నిండినది"**, ఎందుకంటే అలా చేసేటపుడు అతడు (మనుష్య శరీరంలో ఉన్నా) స్వయం అడవి జంతువు స్థాయికి దిగుతాడు. అందువలన అతడి అంతం కూడా జంతువు అంతంలాగానే అవుతుంది.

**(రాధాస్వామిసత్సంగ్‌బ్యాస్ వారికి కృతజ్ఞతలతో..)**

# ఇస్లాం మతం



## దయ, దైవగుణం గురించి మహమ్మద్ ప్రవక్త (సఅసం)

ఎవరి మనస్సులోనైతే సాటి మనుషుల పట్ల దయ, కరుణ ఉండదో, ఇతర జీవుల పట్ల సానుభూతి ఉండదో అలాంటి వారిని దైవం తన ప్రత్యేక కరుణకు దూరంగా ఉంచుతాడు.

మరో సందర్భంలో మహమ్మద్ ప్రవక్త (స) "సృష్టి సమస్తం దేవుని కుటుంబం కనుక మీరు (మానవులు) పరస్పరం ప్రేమానురాగాలతో, కరుణ, వాత్సల్యాలతో, సహనం, సానుభూతులతో వ్యవహరిస్తూ సృష్టిలోని ఇతర ప్రాణులతో కూడా దయతో బాధ్యతగా మసలుకోండి" అని సెలవిచ్చారు.

**– బుఖారి**



ఒకసారి మహాప్రవక్త (స) వెళ్ళే దారిలో ఒక ఒంటె కనిపించింది. దాని కడుపు పీక్కుపోయి వెన్నుతో కలిసినట్లుంది, దాని పరిస్థితి. అప్పుడు ఆయన అనుచరులకు బోధించారు. "నోరు లేని ఈ ప్రాణుల గురించి దైవానికి భయపడండి, వీటిని మంచి స్థితిలో ఉంచి (పోషించి) స్వారీ చేయండి, మంచి స్థితిలోనే వదలండి". **– అబూదావూద్ - సుహైల్ ఇబ్నుల్ హన్జలియ**

**అబ్దుల్లా బిన్ జాఫర్ ఉల్లేఖనం :-**

"ఒకసారి మహా ప్రవక్త (స) ఒక అన్సారీ సహచరుని తోటలో ప్రవేశించారు. అక్కడ ఎవరో ఒక ఒంటెను కట్టారు. అది మహాప్రవక్త (స)ను చూసి బాధగా అరిచింది. దాని కళ్ళ వెంట అశ్రువులు రాలసాగాయి. మహా ప్రవక్త దాని సమీపానికి వెళ్ళి దాని మూపురాన్నీ, కణతల్నీ లాలనగా తట్టారు. అది శాంతించింది. 'ఈ ఒంటె ఎవరిది?' అని అడిగారు మహాప్రవక్త (స).

ఒక అన్సారీ యువకుడు వచ్చి "దైవ ప్రవక్తా! ఈ ఒంటె నాదే" అని బదులిచ్చాడు. దానికి ఆయన "నీకు దైవ భీతి లేదా? అల్లాహ్ నీ స్వాధీనం చేసిన ఈ మూగ ప్రాణిని గురించి నీవు అల్లాహ్‌కు భయపడవా? ఇది ఏడ్చి నాతో ఫిర్యాదు చేస్తోంది - నీవు దీన్ని సరిగ్గా మేపకుండా ఎల్లప్పుడూ పని చేయించుకుంటూనే ఉన్నావని!" అని మందలించారు.

– రియాజుస్సాలిహీన్

(సంగ్రహం : హదీస్ వెలుగు, మూలం :మౌలానా జలీల్ అహ్సన్ నద్వి)

# జంతువుల ప్రార్థన




జంతువులు కూడా ప్రాణమున్న జీవులే వాటికి భాధ, నొప్పి వుంటుంది. అవి కూడా మానవులలాగే సుఖాన్ని కోరుకుంటాయి. గమనించండి. కుక్కకు బిస్కట్లు చూపిస్తే తోకాడిస్తూ దగ్గరకు వస్తుంది. కానీ కర్ర చూపిస్తే తోకముడిచి పారిపోతుంది. కారణం బిస్కట్టు సుఖం, కర్ర దెబ్బ బాధాకరం.

అవి కూడా మానవులలాగే బాధ కలిగినపుడు ప్రతిఘటిస్తాయి. బాధపడతాయి. అలా కష్టం కలిగినపుడు మానవులలాగే భగవంతుని ప్రార్థిస్తాయి. కానీ అవి తమ భాషలో ప్రార్థిస్తాయి. కానీ వాటి భాష మానవులకు అర్థం కాదు. అందుచేత జంతువులు ప్రార్థించవని ప్రార్థించలేవని అనుకోకండి.

శ్రీ కృపాల్ సింగ్ నారంగ్ గారు "హంసా రత్నాలు ముత్యాలు ఆరగించు" అన్న పుస్తకం ద్వారా జంతువుల ప్రార్థన గురించి ఈ విధంగా చెప్పడం జరిగింది.

"ఈ అమాయకపు మూగ జీవులు మాట్లాడగలిగితే, మనం కనుక వాటి మాటలు అర్థం చేసుకోగలిగితే అవి పరమాత్మ ముందు ఏమని ప్రార్థిస్తున్నాయో మనకు అర్థమవుతుంది".

**"ఓ పరమాత్మా! నేడు మా విన్నపం ఆలకించు,**
**హే ప్రభూ! నిస్సహాయులమైన మేము ఎన్నో కష్టాలను అనుభవిస్తున్నాము.**
**మమ్ములను కూడా నీవే సృష్టించావని ఈ లోకులు ఎప్పుడు అర్థం చేసుకుంటారు?**
**మా నొప్పి కూడా వారి నొప్పి లాంటిదే!**
**హే పరమాత్మా! మేము కూడా నీ వారమేనని వీరికి చెప్పు.**
**మానవులు ఈ అత్యాచారం నుండి మమ్ములను ఎప్పుడు విముక్తులను చేస్తారో!**
**వారు కరుణ, దయ, ప్రేమలను ఎప్పుడు ధరిస్తారో!**
**మాకు వీరి అత్యాచారం నుండి విముక్తి కలిగించు.**
**ఈ మా అభ్యర్థనను మన్నించు! హే పరమాత్మా! ఇదే మా ప్రార్థన!"**

**హింసా ఛోడో - అంటే జంతువులపై దయ చూపండి.**
**హంసా పకడో - శ్వాస మీద ధ్యాస వుంచి ధ్యానం చేయండి.**



# భూత 'దయ' గురించి మహాపురుషుల అభిప్రాయాలు



"ప్రాణుల పట్ల దయ చూపడమే 'ధర్మము' వాటిని చంపడమే మహా పాపము".

**– గౌతమ బుద్ధుడు**



"జీవకారుణ్యం అలవరచుకొని మాంసాహారాన్ని విడిచిపెట్టు. జాలి, దయతో నిండిన మనస్సు కలవారందరూ సన్మార్గ సంఘంలో చేరవచ్చు".

**– వడలూర్ వళ్ళలార్**



"ఏ వ్యక్తి కూడా హృదయంలో దయాభావం లేనట్లయితే అతడు పరమార్థ (భగవంతుని) మార్గంలో నడువలేడు. దయ అనేది మతానికి మూలం. దయలేని హృదయంలో ఈశ్వరానుభూతి కలుగనే కలుగదు. **– కబీర్ సాహెబ్**



"ఎంతటి ఉన్నత జాతిలో పుట్టినప్పటికీ మాంసాహారాన్ని భుజించేవారు నీచ జాతికి చెందిన వారి క్రిందే లెక్క".

**– తిరుమూలర్**



'దయ' లేక 'కరుణ' అనే పదాలకు అర్థం ఇతర జీవులను హతమార్చకుండా వుండడం.

**– తిరువళ్ళువర్**

యూదుల ప్రవక్త నూహ్ మహాత్ముని 7వ ఆదేశం.

"ఎట్టి పరిస్థితులలో జీవించి వున్న జంతువుల మాంసం తినకుండా ఉండటం". **– నూహ్**



మాంసం, మద్యం మరియు గ్రుడ్లు విషంతో సమానం. వీటిని సేవించటానికి ఎన్నటికీ ఏ విధంగానూ అనుమతి ఉండదు.

**– మహరాజ్ సావన్ సింగ్**



దయ గల హృదయమే భగవన్నిలయం.

**– మళయాళ స్వామి**



"మానవుడు ఎలాంటి పరిస్థితులలోనూ మాంసం తినడం సరి కాదు. మనం పశువుల కన్నా ఉన్నతులం. మాంసం తిని నిమ్న శ్రేణికి చెందిన జంతువుల వలె ప్రవర్తించడం మనకు యుక్తం కాదు".

**– మహాత్మా గాంధీ**



"రక్తం కలిసిన ఎలాంటి పదార్థాన్ని తినకూడదు. ఏ జీవిని హత్య చేయకూడదు.

**– లియోనార్డో డావిన్సీ**



"ముల్లు గుచ్చుకుంటేనే బాధపడేవారు జంతువుల గొంతు కోసి ఎలా తింటారు?"

**– మలూక్ దాస్**

"అందరిలోనూ ఆ ఒక్క పరమాత్ముడి ప్రకాశమే ఉన్నదనే సంగతిని గుర్తుంచుకో. నీవు పెద్దల ఆజ్ఞానుసారం నడుచుకోవటం లేదు. నిర్దయుడే (దయలేనివాడే) నిజమైన మతభ్రష్టుడు, నాస్తికుడు, నీచుడు".

**– పలటూ సాహెబ్**



"క్షమ అనే జపమాలతో, దయ అనే దేవతను పూజించిన మానవుడే శ్రేష్టుడు".

**– గురునానక్**



"మనము ఆ దుఃఖిత జీవుల కన్నీటి ఆర్తనాదాలను వినడానికైనా సిద్ధంగా లేము. గుర్తుంచుకోండి వాటి హాహాకారాలు మీరు వెళ్ళే పరలోకం దాకా వెంబడిస్తాయి"

**– లార్డ్ టోనిసన్**



మాంసాన్ని ప్రచారం చేసేవారంతా రాక్షస సమానులే. వేదాలలో ఎక్కడా మాంసభక్షణ గురించి పేర్కొనబడలేదు.

**– దయానంద సరస్వతి**

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

1) జీవితశాస్త్రం (మొదటిభాగం) - రూ.100/-
2) జీవితశాస్త్రం (రెండవభాగం) - రూ.130/-
3) జీవిత సత్యాలు - రూ.100/-
4) భగవంతుడంటే - రూ.130/-
5) సత్యమార్గం - రూ.130/-
6) ఆత్మ శాస్త్రం - రూ.130/-
7) ధ్యాన శాస్త్రం - రూ.100/-
8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) - రూ.130/-
9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) - రూ.130/-
10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం - రూ.130/-
11) ధ్యాన శక్తి - రూ.100/-
12) తెలుసుకోండి - రూ.120/-
13) జీవిత సూక్ష్మాలు - రూ.120/-
14) గీతాసందేశం - రూ.100/-
15) కర్మ సిద్ధాంతం - రూ.80/-
16) బ్రహ్మజ్ఞానం - రూ.60/-
17) ఆత్మజ్ఞానం ఎందుకు? - రూ.70/-
18) ధ్యానమంటే ? - రూ.50/-
19) జ్ఞాన జ్యోతి - రూ.70/-
20) జ్ఞాన కుసుమాలు - రూ.70/-
21) దుఃఖ నివారణామార్గం - రూ.60/-
22) త్రివిధాలు - రూ.60/-
23) ధ్యానం (పత్రీజీ) - రూ.60/-
24) ధ్యానం వల్లనే జ్ఞానం - రూ.60/-
25) అతీంద్రియ శక్తులు - రూ.60/-
26) శాస్త్రాల అర్థం - అంతరార్థం - రూ.60/-
27) ఆశ్చర్యం... ఆశ్చర్యం - రూ.50/-
28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య - రూ.60/-
29) మౌన ధ్యానం - రూ.40/-
30) ఈ జీవితం ఎందుకు? - రూ.50/-
31) నిర్వాణ మార్గం - రూ.50/-
32) షిరిడీసాయి సందేశాలు - రూ.40/-
33) భాగవత సన్నివేశాల అంతరార్థం - రూ.40/-
34) భూతదయే దైవత్వం - రూ.60/-
35) ఆలోచించండి - రూ.60/-
36) సంకల్పమంటే? - రూ.50/-
37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) - రూ.30/-
38) మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? - రూ.20/-
39) శాకాహారమే మానవాహారం - రూ.15/-
40) అహింస మరియు శాఖాహారం - రూ.15/-


పుస్తకముల కొరకు :

**తటవర్తి వీర రాఘవరావు,**

తటవర్తి వారి వీధి, భీమవరం-534 201. (ప॥గో॥జిల్లా.)

ఫోన్ : 9490171853, సెల్ : 9440309812



"నీ క్రింది జీవులపై దయ చూపించినపుడే
నీ పైవారు నీపై దయ చూపిస్తారు".

- బ్రహ్మర్షి పత్రీజీ



శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ (12-13)
తా:- సమస్త ప్రాణుల పట్ల ద్వేషము లేనివాడు. కరుణ,
స్నేహభావము కలవాడు ఎవడు కలడో! వాడు నాకు ఇష్టుడు.

- శ్రీ కృష్ణ భగవానుడు



"భూతదయకు సమమైన పుణ్యం లేదు.
ప్రాణి పీడనం కంటే గొప్ప పాపం లేదు"

- శ్రీ నారద మహర్షి



"మన మనస్సులో దయ అనే భావము వుంటే ఈ జీవితము అమూల్యమైనది.
జనులు తాము స్వయముగా నిర్దయులై వుండి దేవతల నుండి దయను ఆశిస్తారు".

- బుద్ధ భగవానుడు



"కరుణ చూపేవారు, జాలి మనస్సు గల వారిపై కరుణామయుడైన దైవం
అనంతంగా కరుణ చూపుతాడు. కనుక మీరు భూలోక వాసులపై,
ఇతర జీవజాలంపై కరుణ, దయ చూపండి. పైవాడు మిమ్మల్ని కరుణిస్తాడు"

- మహ్మద్ ప్రవక్త (అబూ దావూద్)



"నీవు ఏది విత్తుతే ఆ పంటనే పొందుతావు"
దయ చూపనివాడిపై పరమేశ్వరుడు కూడా దయ చూపడు.

- జీసస్ క్రైస్ట్



"ఏ మానవుడి హృదయంలో దయలేదో
అతడి లోపల జ్యోతి ప్రకాశం కలుగదు".

- గురునానక్



"ప్రతీ మతానికి మూలం దయ. హిందూ, సిక్కు, మహ్మదీయ,
యూదు, జైన, బౌద్ధ, క్రైస్తవ మొ॥గు మతాలన్నిటి సారం ఒక్కటే!
ప్రతీ మతం యొక్క పునాది దయే "

- సర్దార్ సంతోఖ్ సింగ్

Rs.60/-

www.passmovement.org